1950



విషయసూచిక :





మూల్యము 0-14-0

వేంకట్రామ్ పవర్ ప్రెస్,
పవరుపేట :: ఏలూరు.

# భారత భాగ్యవిధాత

వీరరస ప్రదర్శనమునకు యుద్ధమే ప్రధానసాధనమని పెక్కండ్రు తలంతురు. కాని సునిశిత ధీశాలులగు సాహిత్య వేత్తలు దానవీర దయావీర ధర్మవీర యుద్ధవీరములను చేర్కొనిరి. శిబి కర్ణ దధీచులు దానవీరులు; బుద్ధభగవానుఁడును, ఏసుక్రీస్తును దయావీరులు. శ్రీరామ, హరిశ్చంద్రులు ధర్మవీరులు. అర్జునాభిమన్యాదులు యుద్ధవీరులు. ఒక్కొక్క వీరునియందొక వీరము ప్రధానముగాను శేషించినవి యానుషంగికములుగాను నుండును. ఏ పురుషునియందీ పలు తెఱఁగుల వీరములుగాని, వానిలోఁ గొన్నిగాని యుత్కటముగా దీపించుచుండునో యాతనియందు దివ్యకళయు భగవదంశమును నొప్పి యట్టిపురుషుఁడు శాశ్వతజీవుఁడగును. ఇట్టి మహనీయులే సహస్రవర్షముల కొక్కఁడో యుద్భవింప వచ్చును. వారి యుద్భవమునకు దేశకాలపాత్రములే కారణములు కావచ్చును. ఆయాకాలపు టక్కఱలనుబట్టి భగవంతుఁడు స్వకీయావతార రూపమునఁగాని, మహాపురుషరూపమునఁగాని యావిర్భవించుచుండును. ఇట్టి మహాపురుషుఁడుగా నెన్నఁదగినవాఁడు మహాత్మగాంధి. ఇట్లన్నప్పుడు సామాన్య మానవునియందు దివ్యత్వ మారోపించుచున్నామని కొందఱాక్షేపించవచ్చును. కాని ముప్పది సంవత్సరములు ప్రత్యక్షముగ నలుబదికోట్ల భారతీయుల హృదయరంగములందేగాక యన్యదేశీయ మహాపురుషుల మానసిక రంగములందును సుందరనృత్యమును గావించి, ప్రపంచ చరిత్రయందు స్వర్ణా

క్షరములతోఁ దన నామమును జిరస్థాయిగ లిఖింపఁజేసి కొన్న మహాత్మునియందు దివ్యాంశ మవశ్యముగ నున్న దన్నఁ దప్పేమి ?

కరుణామూర్తి బుద్ధభగవానుఁడు దాను భగవంతుఁడను గాననియుఁ దనయందు మాంత్రిక దివ్యశక్తులు లేవనియుఁ జెప్పకొన్నను నాతని యనుయాయు లాతని నవతార పురుషునిగనే భావించిరి. గాంధియుఁ దన్ను మహాత్ముఁడని యనవలదనియుఁ దనయందు దివ్యత్వమేమియు లేదనియు హిమాలయ పర్వతములంత లేసి దోషములు గావించితి ననియు నధమాధమజాతి జన్మము తన కభిలషిత మనియుఁ జెప్పకొన్నను, నాతని చేష్టలయందు మెఱసిన దివ్యలక్షణములు భారతీయులు గుర్తింపకపోరు. ఒకవేళఁ గొందఱు విరుద్ధ వ్యక్తులు గుర్తింపకపోయినను, గాంధి భారతజాతికిఁ గావించినసేవ సూర్యతేజస్సునలె మఱుగు పఱుపరానిది.

గాంధియందు మున్నుఁ బేర్కొనబడిన నలువగల వీరములును సమప్రధానముగ నమరియున్నవి. కాని వాని నతఁడు బహిర్గతము గావించిన రీతులుమాత్రమపూర్వములు; అమేయములు. ఈతని యుద్ధ మహింసాయుద్ధము. అస్త్రశస్త్రరహితుఁడై దన మైదడుగుల బడుగుటొడలియందుదాగియున్న యాత్మ తేజఃపుంజముచే బ్రిటిషు రాజ్యసింహపు మునుమోమున మిఱుమిట్లుగొలిపి, దాని పరాక్రమచిహ్న కేసరములను బెఱికివైచి యది వెనుదిరిగి పాఱిపోవునట్లొడిం

చిన వీరుఁడీతఁడు. పురుషకారమునకు దైవము దోడుపడు నట్లీతని యత్నమున కంతర్జాతీయ రాజకీయపరిస్థితు లనుకూలించినవి. ఎట్లయినను జయలక్ష్మిని జేపట్టి ప్రపంచవీరుఁ డైనాడు. ఈతడు దరిద్రనారాయణోద్ధరణమునకుఁ దన జీవితమునంతను ధారపోసిన దానవీరుఁడు. దీనమానవసేవకును, హరిజనరక్షణకును బద్ధదీక్షితుఁడైన దయావీరుఁడు. సత్యధర్మపరిపాలనమునకును, హిందూమహమ్మదీయమత సామరస్యమునకును నసువుల నర్పించిన ధర్మవీరుఁడు. ఇట్టి మహనీయుని జీవితచరిత్రాంశములను స్మరించి యథోచితముగ వీరపూజఁ గావించుదముగాక.

బొంబాయి రాష్ట్రమున కథియవాడమండలములో నొక చిన్నసంస్థానముగలదు. దానికి రాజధాని పోరుబందరు. దీనికి సుదామపురియని మఱియొక పేరుగలదు. శ్రీకృష్ణ నివాసమని పురాణప్రసిద్ధివడసిన ద్వారకాపురి కేబదిమైళ్ళ దూరములో నున్నది. ఆపురమునగాంధికులనామముతో నొప్పు నొకసుప్రసిద్ధ వణిగ్వంశమువారు గాపురముండిరి. ఆవంశమున 'ఉత్తమచందు' అనునతఁడు రాజకీయకార్యనిపుణుఁడై పోరుబందరు సంస్థానపు దివానుగను బిమ్మట రాజకోట సంస్థానపుదివానుగను వ్యవహరించుచుండెను. అతని కొమారుఁడు కరంచందు. కరంచందు రాజకోట దివానుగఁ గుదిరెను. ఈయనపత్ని పుత్తలీబాయి. ఈమెయత్యంత పూర్వాచార పరాయణురాలు. కుటుంబము ధనికకుటుంబము. కరంచందు సంస్థానపు దివానగుటచే దాసదాసీజనులకు లోటు

లేదు. అందుచే పుత్తలీబాయి విశేషసమయము దేవతా పూజాకైంకర్యాదులందును, పురాణశ్రవణాదికము నందును గడుపుచుండెను. ఉపవాస దీక్షలు గడు శ్రద్ధతో నిర్వహించు చుండెను. ఇంచుమించు వందయేండ్ల వెనుకటి మాటయిది. పాశ్చాత్య నాగరికతా ఝంఝూమారుతము నాఁటికి దీవ్ర రూపముదాల్చలేదు. ఆర్యమతధర్మమహావృక్షపు గడకొమ్మలను విఱిచినదిగాని లోలోనఁజొరఁబడి శాఖాచ్ఛేదముచేయ లేదు. రూపనాశముఁ జేయఁదొరకొనలేదు. పుత్తలీబాయి నియమపాలనమునం దచంచలురాలై కులవృద్ధుల యుపదేశములను గైకొనుచు ధర్మరక్షణచేసికొనుచుండెను.

కరంచందుపుత్తలీబాయులకు మువ్వురుపుత్త్రులు. వారిలో గనిష్ఠుఁడు మోహనదాసుఁడు. ఇతఁడు క్రీ. శ. 1869 వ సంవత్సరమున అక్టోబరు రెండవ తేదీనిజన్మించెను. ఈతనిసంపూర్ణ నామము మోహనదాసు కరంచందుగాంధి. మోహనదాసు నందుఁ దండ్రి కార్యదక్షతయుఁ దల్లి ధర్మదీక్షయుఁ జిహ్నితములైయుండెను. మోహనదాసునకు వీధిబడిలోనక్షరాభ్యాసము చేసిరి. తిన్నగబడికి పోవుటయు వచ్చుటయునే గాని పోరుగు బాలురతో జగడములాడుట, ధూర్తకార్యములొనరించుటయు నన్న నితనికిఁ గిట్టదు. ఆకాలమునఁ బాఠ్యపుస్తకములలో ముప్పాతికవంతు పౌరాణిక గాథలే వ్రాసియుండెడివి. గాంధి హరిశ్చంద్రుని కథ చదివి యాతని సత్యదీక్షకు వెఱగుపడెడివాఁడు. విసుగులేక యెన్నిమార్లయిన నాకథను జదివెడివాఁడు. భగవద్గీతాపఠనమునం దాసక్తి

మెండు. సుదాముఁడను బాలుఁడు స్వసుఖము నుపేక్షించి జననీజనకులసేవయే ప్రధానాశయముగఁ బెట్టుకొని కీర్తిగడించిన కథ గాంధిమనస్సు నెంతయో యాకర్షించెను. ఒకప్పుడు పాఠశాలకుఁ బరీక్షాధికారివచ్చి యుక్తలేఖనము చెప్పెనఁట. ఉపాధ్యాయుఁడు బాలుర పంక్తులమధ్యఁ దిరుగుచు విద్యార్థులు సరిగ వ్రాయుచుండిరో లేదో యని గమనించుచుండెను. గాంధి తన పలకలో నొక తప్పువ్రాసెను. ప్రక్కబాలుని పలకలోఁజూచి యా తప్పును సవరించుకొనుమని సూచించుట కుపాధ్యాయుఁడు గాంధి కాలిని ద్రొక్కి సైగ చేసెను. కాని గురువు నుద్దేశము గ్రహించియు బాలుఁడధర్మమునకుఁ బాల్పడక దనకుఁ దెలిసినట్లుగనే వ్రాసెను గాని, పొరుగుబాలుని పలకనుబట్టి లేఖనాచౌర్యమున కంగీకరింపలేదు.

పండ్రెండేండ్లప్రాయమున నా కాలపు టాచారమును బట్టి అన్నగారి పెండ్లిలో గాంధికి వివాహము గావించిరి. అంతటి లేఁబ్రాయమున వివాహ మర్థశూన్యమని నిరాకరించుటకు గాంధికి ధైర్యమెక్కడిది! తల్లిదండ్రుల నిర్ణయమమోఘము. మతాచారములు నిరంకుశములు. వివాహితుఁడైన పిమ్మట గాంధికిఁ జదువు కుంటువడెను. వణిజులకు వ్యాపారదక్షత కావలెను గాని యున్నతవిద్య యెందులకనెడి భావము పెక్కండ్ర కుండెను. కాని వీరి వంశీయులు వర్తకులేగాక సంస్థానపు దివానులును గనుక నెట్లయిన గాంధిని పైకిఁ జదివింపవలెనని తలిదండ్రుల కాసక్తి పొడ

మెను. బాలుని నుత్తమపాఠశాలలోఁ జేర్చిరి. ఇతనికి మొగ మోటమి హెచ్చు. నలుగురు బాలురతోఁగూడి యుచ్ఛృంఖలముగ నాటపాటలలోఁ గాలము గడుపవలెనను తలంపే లేదీతనికి. గంగిగోవువలెఁ దలవంచుకొని తిన్నగ బడికేగి బడి విడుపుగంట కొట్టఁగనే యింటి కేగుచుండెడివాఁడు. ఇంటనున్నపుడు జననీజనకుల యాజ్ఞలకు బద్ధుఁడై వారికి సేవలొనరించు చుండెను. పాఠశాలలోఁ దన పాఠముల నాసక్తితోఁ జదివెడువాఁడు గాని విశేష ప్రసిద్ధిని బొంద లేదు. ఇంతలో నీతని భార్య కస్తూరిబాయి కాపురమునకు వచ్చెను. అందఱు నూతన భర్తలవలెనే భార్యారతుఁడై గాంధి యానందడోలికల నూగులాడెను. ఇంతలోఁ దండ్రి దివంగతుఁడాయెను. గాంధికి పదునెన్మిదవ యేటనే ప్రథమ పుత్త్రజనన మాయెను. ఈ విధమున సాంసారిక బంధము లంతకంతకు దృఢతరములగుచుండెను.

గాంధి మెట్రిక్యులేషను పరీక్షయం దుత్తీర్ణుఁడగుటచే భావనగరు కళాశాలలో నున్నతవిద్య నారంభించెను. కళాశాలలో దేశభాషతప్ప మిగిలిన విషయములన్నియు నాంగ్లమున బోధించుచుండిరి. పుట్టుకతోఁ బుట్టిన కర్ణములకంటె వెనుకఁబుట్టిన శృంగములు వాడియన్నట్లు నూతనముగ దిగిన యాంగ్లభాషకు వాడి యెక్కువాయెను. కళాశాలోపన్యాసకులు ఆంగ్లోపన్యాసకులతో సమానముగనో యంతకంటె హెచ్చుగనో యాంగ్లమున బోధింపఁగలమని దర్పములు గొట్టుచుండిరి. నిరర్గళముగ నుపన్యాసములు జరుగు

చుండ విద్యార్థులు దిగ్భ్రాంతులగుచుండిరి. గాంధికి గ్రుక్క తిరుగుటలేదు. కళాశాలయన్న వెగటుదోఁచెను. ఏ దేశము వారి కాదేశభాషలోనే విద్యాబోధనము జరుగవలెనని యును నింపుకొనుటకుఁ బరభాషనాశ్రయించుట మాతృస్తన్య మును విడిచి 'డబ్బాపాల' నాశ్రయించుట వంటిదనియు సేతని మనమున నొక గాఢభావ మంకురించెను.

గాంధి కళాశాల విద్యకు స్వస్తిచెప్పి యిల్లుచేరెను. కాని నిర్వ్యాపారుఁడై యుండుటెట్లు? ఇంగ్లాండునకుఁ బోయి మూఁడేండ్లు న్యాయవాదవిద్యను నేర్చి బారిస్టరుపట్టము పొంది తిరిగి వచ్చినచోఁ బూర్వము తండ్రిగారిదగు దివాను పదవి నొందవచ్చునని యొక బ్రాహ్మణమిత్రుఁడు నచ్చఁ జెప్పెను. కాని సహజముగ బిడియముగలవాఁడై, మత ధర్మ సంప్రదాయములందు బెరిగిన గాంధి నింగ్లండు పంపు టెట్లు? కుల వృద్ధులు గొందఱు వలదనిరి. తీవ్రముగ బెద రించిరి. ఇంటిలోఁ జాల తర్జనభర్జనలు జరిగెను. పుత్లీ బాయి చాల దిగులుచెందెను. విదేశములకేగినవారు కుల ధర్మచ్యుతులగుదురని యామెభీతి. గాంధి మనస్సు విదేశ గమనముపైపు మ్రొగ్గెను. తుదకాతఁడు మద్య మాంస మహిళా సంపర్కములకు లోనుగానని పెద్దలయెదుట ఘోర ప్రతిజ్ఞ గావించినపిమ్మట గాంధి విదేశములకేగుట కాతని తల్లి యనుమతించెను. పుత్త్రుఁడు దృఢవ్రతుఁడనియు, సత్య ప్రతిజ్ఞుఁడనియుఁ దల్లి పూర్తిగ నమ్మెను. గాంధియు నానమ్మకమునకు సర్వవిధముల నర్హుఁడాయెను.

ఓడలో నమ్మఁబడు నాహారవస్తువులయందు మద్యమాంస సంపర్కలేశముండునేమోయని శంకచే గాంధి వానిని ముట్టక, యింటినుండి తెచ్చుకొన్న తినుబండములతోనే గాలక్షేపము చేసెను. శీతలదేశము సమీపించిన కొలదియు నీతని నియమపటిమ సడలుననియు, ఇంగ్లండులో మద్యమాంసములు సేవింపనిదే బ్రతుకఁజాలరనియుఁ గొందఱీతనితోఁ దీవ్రముగ వాదించిరి. కాని యావాద భల్లములీతని నియమ దుర్గమును భేదింపఁజాలక పోయెను. ఇంగ్లండు చేరి యచ్చటి సభ్యత కనుగుణముగ వస్త్రధారణమునందును సల్లాప విహారము లందును గొంత పరివర్తనము చేసికొన్నను దన జీవ నౌకకు మూలాధార స్తంభమగు మాతృప్రతిజ్ఞను మాత్రము గాపాడుకొనుచుండెను. కేవల శాకాహార భోజనమునందు నమ్మిన కొందఱు మిత్రులను జేర్చుకొని శాకాహార ప్రశస్తి ప్రచారమును గూడఁ గావించెను. పరస్త్రీలు దన్ను జనువుగఁ జేరకుండునట్లు చూచుకొనెను. ఒకప్పుడీతని భ్రమింపజేయ నేతెంచిన యొక యువతి వ్యర్థురాలై తిరిగి పోయెను. గాంధి మూఁడేండ్లిట్లసిధారా వ్రతముగఁగడపి బారిస్టరు పట్టభద్రుడై క్రీ. శ. 1891 లో మాతృదేశమునకుఁ దిరిగివచ్చెను. ఈతఁడు రాకుండఁగనే మాతృదేవి స్వర్గస్థురాలాయెను.

గాంధి బొంబాయినగరమున నున్నత న్యాయస్థానమున న్యాయవాదవృత్తి నారంభించెను. నిశిత సత్యవ్రతుఁడగు నీతఁడావృత్తిలోఁ బనికిరాలేదు. ఎక్కువ యభి

యోగము లీతని కడకు రాలేదు. పురవాసమున కత్యవసర మగు నాడంబర జీవితము నెంతదూరముగఁ దొలఁగించు కొనుచున్నను నీతనికి సరిగ దినములు గడుచుట లేదు. న్యాయ స్థానమునకు నడచి పోయెడివాఁడు. పిమ్మట బొంబాయివిడిచి రాజకోటలోఁ దన వృత్తి నారంభించెను. సత్యేతరముగాని యభియోగములను మాత్రమే గ్రహించుచు వీలైనప్పుడెల్ల నిరుపక్షములవారికిని సమాధానము చేయుచుండెడివాఁడు. ఇట్లుండ అబ్దుల్లా యను నొక మహమ్మదీయ శ్రీమంతునికి దక్షిణ ఆఫ్రికాలోని మఱొక మహమ్మదీయ వర్తకునితో వ్యాపారపు లెక్కల విషయమునఁ గలహమువచ్చెను. అచ్చటి న్యాయస్థానములో 'దావా' యారంభించిరి. అబ్దుల్లా గాంధిని తన పక్షపు న్యాయవాదిగా వరించెను. గాంధి తన యాలుబిడ్డలను విడిచి తానొక్కఁడే క్రీ. శ. 1893 లో నాఫ్రికాకుఁ బోయెను.

## ఆఫ్రికాలో గాంధి

దక్షిణాఫ్రికా ప్రయాణముతో గాంధి జీవితలత మొగ్గదొడుగ నారంభించెను. గానుగెద్దువలె నెదుటనున్న వ్యాపారమును మాత్రమే జూచు స్వభావము గాదీతనిది. ఇరువైపులఁ జక్కగఁ జూచుచు నాదేశపు టాదిమవాసులగు నీగ్రో జాతివారి యనాగరికస్థితిని, నమాయికులగు ప్రజల నణచివైచి కోట్లకొలఁది ధనమునార్జించి ముష్కరచేష్టలను గావించుచున్న ఆంగ్లవర్తకుల యొక్కయు, బోయర్లను డచ్చిజాతి వర్తకులయొక్కయు దౌర్జన్యమును, కూలిపని

నిమిత్త మాఫ్రికాకుఁజేరి యధఃకృతులై యవమానితులగు చున్న భారతదేశీయుల దీనస్థితిని గాంధి యర్థము చేసికొనెను. ఆంగ్లేయులు దక్షిణాఫ్రికాలో నపార ధనము నార్జించి ధన బలముచే నధికారబలము చేపట్టి, తమ యోగక్షేమ రక్షణార్థము ప్రత్యేక శాసనదుర్గములను దమ చుట్టును నిర్మించుకొనిరి. భారతీయులను దృణీకరించిరి. నల్లవారు గొంతధనము గూర్చుకొని వ్యవసాయమును, వర్తకమును జేసికొనుచున్నను వీరికి సభ్యత లేదనియుఁ దమతోఁ గలిసి మెలిసి యుండ ననర్హులనియుఁ దెల్లవారి భావము. నల్లవాఁ డెంత విద్యావంతుఁడైనను న్యాయస్థానములలోఁ దలపాగా పెట్టుకొనరాదు. దొరలు వసించు వసతిగృహములలోను అన్న విక్రయశాలలలోను నడుగిడరాదు. ఆంగ్లేయుల యందలి యిట్టి జాత్యహంకారమును గాంధి గుర్తించెను. దానికి గురియై పెక్కుబాధలు పడెను.

ఒకనాఁడు గాంధి రైలులో ప్రయాణము చేయు చుండఁగా నొక యాంగ్ల ముష్కరుఁడు గాంధిని ధిక్కరించి, టిక్కెట్టున్నను నాబండిలో నల్లవాఁడు ప్రయాణము చేయ రాదని తిట్టి యాతని బట్టలను, పరుపును బండిలోనుండి వెలుపలికిఁ ద్రోసివేసెను. ఇట్టి దౌష్ట్యములను రైళ్లలోను, న్యాయస్థానములలోను గాంధి యనుభవించెను. మొదటఁ దానువచ్చిన పని నిర్వర్తింప దలఁచి శ్రద్ధతో అబ్దుల్లా అభియోగపు లెక్కలను పరీక్షించెను. ప్రతికక్షికిఁ గూడ నీతనియందు నమ్మకము గుదిరెను. ఇరువురకును సమాధా

నము చేయుఁబూని పంచాయతీ నేర్పాటుచేసెను. అబ్దుల్లాకు ఆఱులక్షల రూప్యములనిచ్చుటకుఁ బ్రతికక్షి యంగీకరించెను.

గాంధి వెంటనే సంఘసేవకుఁ బూనుకొనెను. ప్రజారోగ్యమును గుఱించియు, విద్యాప్రచారమును గుఱించియు, సత్ప్రవర్తనను గుఱించియు సభలుజేసెను. అచ్చట నున్న భారతీయులలో హిందువులును, మహమ్మదీయులును, సిక్కులును గలరు. పంచములును గలరు. వీరందఱును కుల, మత, వర్ణ, భాషా విభేదములను మఱచి యేకజాతీయులుగా మెలఁగునట్లు గాంధి ప్రబోధించెను. హిందూస్థానీ భాషను నేర్పెను. స్వయముగ నుపాధ్యాయుఁడై క్రొత్త పద్ధతులపై విద్యగరపెను. భారతీయులకు నిరాకరింపబడిన 'వోటు హక్కు'ను సంపాదించుటకును వారికి విధింపఁబడిన తలపన్నును దొలఁగించుటకును, ఆంగ్లేయులింకను ప్రవేశ పెట్టఁదలఁచిన నూతన శాసనములను నిరోధించుటకునుఁ దీవ్రసంచలనమును బయలుదేరఁ దీసెను. 'నేటాలు ఇండియన్ కాంగ్రెసు' అను సంస్థ నేర్పఱచి, ప్రభుత్వమునకు విజ్ఞాపన పత్రములను బంపి, యూరేగింపులు గావించి, ప్రతిఘటనోద్యమము మొదలుపెట్టి, దక్షిణాఫ్రికా యందలి భారతీయుల సహాయార్థము మాతృదేశమగు హిందూ దేశములో నాందోళనమవసరమని యెంచి గాంధి స్వదేశమునకుఁ దిరిగివచ్చి బొంబాయి, ప్రయాగ, కలకత్తా, మదరాసు మున్నగు పట్టణములలోఁ బెక్కు సానుభూతిసభలు గావించెను.

ఆఫ్రికాలో రాజకీయ పరిస్థితులు విషమించెననియు, గాంధినటకు రమ్మనియు లేఖలు వచ్చుటచే నాతఁడు రెండవ మాఱు 1896 వ సంవత్సరమున దక్షిణాఫ్రికాకుఁ బయనించెను. జాతిద్వేషముతో మండిపడుచున్న యాంగ్లేయులకు గాంధిరాక హృదయశల్యమాయెను. ఓడనుండి దిగకుండఁగనే గాంధిని హతమార్పవలెనని ముష్కరయువకులు గుమిగూడి "కూలిగాంధి, కూలిగాంధి" యని యఱచుచుఁ జుట్టుముట్టిరి. నౌకాధికారులు జాగ్రత్తగ నోడనుండి దింపిన గాంధిని గొందఱు ధూర్తులు గుర్తుపట్టిరి. బెబ్బులులవలె నఱచుచు, మీఁదఁబడి గ్రుద్ది తన్నిరి. దెబ్బలుతిని, రక్తముగాఱుచుండ గాంధియొక యింటి యరుగునకుఁ జేరగిలఁబడిపోయెను. అంత నొక యాంగ్లాధికారిభార్య ధూర్తులను వారించి గాంధిని సురక్షితస్థలమునకుఁ జేర్చెను. ఇంతలో భారతీయానుచరులు వచ్చి యతనిని దీసికొనిపోయి యుపచారములుచేసి దెబ్బలు మాన్పిరి. తనమీఁద దౌర్జన్యము గావించిన యాంగ్ల యువకుల మీఁద నభియోగము పెట్టుమని మిత్రులుచెప్ప గాంధి యందులకు నిరాకరించి దుర్మార్గమును దుర్మార్గముచే నెదుర్కొన్న నది మఱింత చెడుననియు, దుష్టుని సత్క్రియవలననే మార్ప నగునని యు బోధించెను. గాంధి విచిత్రతత్త్వమును విన్న యాంగ్లేయులు లోలోన సిగ్గుపడిరి. నాఁటినుండియు వారిలోఁ గొందఱతనికి మిత్రులును సేవకులునైరి.

గాంధి యెల్లపుడును పతితులను జేపట్టి, వారికిఁగల యిక్కట్టులను దీర్చుటయేగాక వారియందలి లోపములను

దుష్టాంగములను జికిత్సకుఁడు ఖండించునట్లు ఛేదించివైచు వాఁడు. శస్త్ర చికిత్సానంతరము బలవర్ధకౌషధముల నిచ్చు నెట్టులరీతి, సదుపదేశబలము చేకూర్చి తన యనుచరవర్గమును సర్వాంగ పరిపుష్టము గావించువాఁడు. భారతీయులలో మత వైషమ్యములు దొలగించివైచి, స్థిరైక్యతను మున్ముందు చేకూర్చెను. సాత్వికాహారపద్ధతినిబోధించి యాచరించి బొబ్బ జాడ్యమువంటి భయంకర వ్యాధులనుగూడఁ గుదిర్చెను. 'ఇండియన్ ఒపినియన్' పత్రికను ఆంగ్ల, హిందీ, గుజరాతీ, అరవభాషలలోఁ బ్రకటించి తన సిద్ధాంతములను బ్రచారము గావించెను. పత్రికను నడుపుటలో ధనాభావముచేతను, ముద్రణాయంత్రములు పనిచేయకయు నిపుణులగు సేవకులు లభింపకయు నెన్నివిషమస్థితు లెదుర్కొన్నను స్థిరప్రజ్ఞతో వానినెల్లఁదరించి నిర్దిష్టకాలమునకుఁ బత్రికను బ్రకటించు వాఁడు. ఆ సమయమున దక్షిణాఫ్రికాలో బోయర్లకును నాంగ్లేయులకును యుద్ధము తటస్థించెను. గాంధి యొక సేవా దళము నేర్పఱచి యుద్ధమునందు క్షతగాత్రుల కుపచార చికిత్సల మూలమున నపారసేవ గావించెను. భారతదేశ మునకుఁ దిరిగివచ్చి యిచటి రాజకీయములందును బాల్గొని, సత్యాగ్రహ యజ్ఞము నారంభించుటకు మరల దక్షిణాఫ్రికా కేగెను. ఈతని యహింసామార్గ మపూర్వము. ఇది ప్రతి కక్షుల కర్థముకానిది. శత్రువు లెట్టి హింసాప్రయోగము లను గావించినను వానినెల్ల సహించి, హింసాయుత ప్రతి క్రియలు చేయక, శత్రువును బ్రేమించి వానిని సన్మార్గము

నకుఁ బ్రిప్పఁజూచుటే యీతని సత్యాగ్రహము. ఈ సత్యా
గ్రహచక్రము నాధునికయుగమున నమోఘముగఁ బ్రయో
గించిన విష్ణుడీతఁడే. ట్రాన్సువాలు మండలములో మొదటి
సత్యాగ్రహము నడిపించెను. 1906 నుండి 1915 వ సంవ
త్సరమువఱకును బెక్కువార్లు సత్యాగ్రహసమరములోఁ
దాను కారాగారబద్ధుఁడగుచు, వందలకొలఁది స్త్రీపురుషు
లకు సత్యాగ్రహదీక్షయిచ్చి, భర్తలనుండి భార్యలును,
తండ్రులనుండి పుత్రులును విడిపోయినను జెక్కుచెదరక
తన యోధులు కష్ట సహనదక్షులగునట్లు తీర్చిదిద్దెను.
ఫినిక్సు అనుచోట నొక సత్యాగ్రహాశ్రమమును స్థాపించెను.
స్వకీయమైన యాస్తి యుండరాదని, రాజకీయ సన్యాసము
గైకొనెను. న్యాయవాదవృత్తినిఁ బూర్తిగఁ ద్యజించి, తన
సిద్ధాంతములకు భాష్యములు వ్రాయుచుఁ, జెప్పుచు ప్రభుత్వ
దుర్గపు బునాదుల నూపివైచెను. శారీరక మానసిక తేజో
బలశక్తుల విజృంభణమునకు బ్రహ్మచర్య మత్యవసరమని
నిశ్చయించి గాంధి బ్రహ్మచర్యవ్రతదీక్షను బూనెను. ఏ
దీక్షయందైనను గాంధి క్షణికదౌర్బల్యమునకుఁ బాల్పడు
వాఁడుకాఁడు. యమనియమములయందిట్టి దిట్ట మఱొకఁ
డుండఁబోడు. ఇట్టి భీష్మప్రతిజ్ఞతో సహస్రరూపకార్యక్రమ
ముతో నితఁడు దన యనుచరులను నూతన జయములకుఁ
బురికొల్పి, దక్షిణాఫ్రికా ప్రభుత్వపు దుష్టసంకల్పముల
యందుఁ బరివర్తనము దేఁగలిగెను. ఇంగ్లండులోఁగూడఁ
బ్రచారము జరిపి తుదకు భారతీయులను గుదింపఁజూచుచున్న

దుష్టశాసనములను దొలఁగించివైచెను. తన యనుచరులు బుద్ధిజాడ్యమునకు లోనై తప్పులొనరించినప్పు డీవీరుఁడు వారి నేరము దనపైవైచుకొని వారి శుద్ధికొఱ కుపవాస వ్రతము లాచరించెను. ఇతరుల దోషములకుఁ దాను బాధ పడి వారిని సంస్కరించుటలో గాంధి యుపవాసాయుధమును పెక్కుమార్లు ప్రయోగించెను. ఇట్టి కఠోర నియమపాలన ముతో సేవగావించినను ధనరూపముగ నెట్టి ప్రతిఫలమును గైకొన నంగీకరింపలేదు. ఒకమాఱు దక్షిణాఫ్రికా భారతీ యులు కృతజ్ఞతా చిహ్నముగ నొక బంగరునగను గస్తూరి బాయికిఁ గానుకగ నొసఁగిరి. స్త్రీసహజమగు నాభరణ ప్రీతిచేఁ గస్తూరిబాయి దానిని గ్రహింప నువ్విళ్ళూరినను గాంధి దానిని నిజముగ నామెకుఁగాక తనసేవకుఁ బ్రతిఫల ముగ నీ నుద్దేశించిరనియు నట్టిదానిని దాను గ్రహింపఁ జాలననియుఁ దెల్పి యాసొమ్మును దిరిగి యిప్పించివేసెను. ఇట్లు దక్షిణాఫ్రికా రంగమున సత్యాగ్రహశక్తి ప్రయోగ మున విజయుఁడై గాంధి 1915 వ సంవత్సరమున మాతృ దేశమునకుఁ దిరిగివచ్చెను.

## భారత సేవాయజ్ఞము

చరిత్రకారుఁడు గాంధి జీవితము నన్నిరంగములఁ జిత్రింపఁగలిగినచో నాకాలపు భారతదేశచరిత్రను వేఱుగ వ్రాయనక్కఱలేదు. గాంధి చరిత్రయే భారతదేశచరిత్ర. న్యాయ, నైతిక, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక, రాజకీయ రంగము లందేవియు గాంధి కరాఘాతములనుబొంది దిద్దఁ

బడనిదిలేదు. ఇంచుమించు ముప్పదియేండ్లు భారతదేశమున గాంధి వేదమే వేదము. దాని కతఁడే బ్రహ్మ; అతఁడే వ్యాసుఁడు. ఆ సేతుహిమాచలముననేగాక ప్రపంచమునం దే దేశమునందైనను నిన్నికోట్ల ప్రజల హృదయముల నింత కాలము గుప్పిటఁబట్టి తాఁదలఁచినట్లెల్ల నాడింపఁగలిగిన మహా మహిమాన్విత మాంత్రికప్రభావుఁడు మఱొకఁడు లేడనుట యతిశయోక్తిగాదు. ఇతనికంటెఁ బెక్కుమడుంగులు మిన్నలగు ధీశాలులును, రాజకీయ వేత్తలును బెక్కురు గలరు. కాని భారతదేశము గాంధికి దాసోహమ్మన్నట్లు మఱియెవ్వరికిని ననలేదు. దానికాతని యకలుషిత సత్య ప్రతిజ్ఞయు, ప్రతిఫల నిరపేక్షక సేవాపరతయు, అచంచల దైవభక్తియునే కారణములు. ఏనాఁడును భారతీయు లెఱుఁగని మార్గముల నాతఁడు జాతిని నడిపించెను. తన్ను బరిహాసించిన నెహ్రూ, చిత్తరంజనదాసు, శ్రీనివాసయ్యం గార్లవంటి మహాశేముషీవంతు లీతని నిష్కపట, నిరాడం బర సమర వ్యూహరచనా దక్షతకు ముగ్ధులై ప్రథమశిష్యు లైరి. మహాదేవదేశాయి, రాజేంద్రప్రసాదు, పటేలు, రాజ గోపాలాచారి, పట్టాభి శీతారామయ్య వంటి కార్యసిర్వ హణ చణులు గాంధి ధ్వజవాహకులైరి. జవహరులాలు యువరాజతుల్యుఁడై లాలితుఁడయ్యెను. సరోజనీదేవి మంగళ హారతులిడి జయగీతములు పాడెను.

గాంధి హిందూదేశమునకుఁదిరిగివచ్చినప్పుడు ప్రపంచ సంగ్రామము చెలరేగుచుండెను. సత్యాగ్రహికి శత్రువును

ప్రేమించుటయు నాతనితో సమాధానమున కెల్లవేళల సంసిద్ధుఁడై యుంటయుఁ బ్రధాన నియమములని గాంధి బోధించెను. తన్ను దిట్టినవారిని మరల నెన్నఁడును గాంధి తిట్టియెఱుఁగడు. బోధించుటకుముందుగఁ దానాచరించి చూపుట యాతని యందలి యొక ముఖ్యప్రకృతి. దీని నవగతము చేసికొనఁజాలని యనుయాయు లొకొక్కప్పుడీతని ప్రవర్తనను శంకించుటయుఁ గలదు. ఒకప్పు డాఫ్రికాలో వ్రేలిముద్రలను వేయించుకొనరాదని తీవ్రప్రచారము రేకెత్తించి, శత్రువుతో గౌరవ సమాధానము కుదురఁగానే గాంధి తానే ముందు వ్రేలిముద్ర వేయుటకు బయలుదేరెను. ఇదిచూచి యొక భారతీయుఁ డుగ్రుఁడై యతనిని గట్టిగఁ గొట్టెను. కాని గాంధి యాదోషిని క్షమించెను. ఆంగ్ల ప్రభుత్వము వలన భారతదేశమున కనర్థము గలుగుచున్నదని రాజకీయ వేత్త లనుచుండ గాంధి యాంగ్లేయులను వారి కష్టకాలములో బాధింపరాదని తెల్పుటయేగాక వారికి యుద్ధమునఁ దోడ్పడవలెనని బోధించెను.

అప్పటికి బాలగంగాధరతిలకు, గోపాకృష్ణగోఖలేలు రాజకీయ నాయకులు. గాంధి కొంతకాలము వారి పాదదాసుఁడై వారి తత్త్వములను మన్నించెను. తిలకు మహారాజు స్వర్గస్థుఁడైన తరువాత గోఖలేగారి భారతసేవక సంఘమున గాంధి చేరఁదలఁచెనుగాని యాశయము లొక్కటియైనను సిద్ధాంతములును నాచరణములును వేఱగుటచే గాంధిసబర్మతీ నదీతీరమునఁ బ్రత్యేకముగ సత్యాగ్రహాశ్రమమును నెలకొల్పి

కొనెను. ఆశ్రమవాసులకుఁ గఠిననియమములువిధింపఁబడెను. కాయకష్టముచేయుచు జీవింపవలెను. సాత్వికాహారముభుజింపవలెను. శత్రువునైనను మిత్రునిగాఁదలఁపవలెను. అస్పృశ్యతను పాటింపరాదు. సొంతసొత్తు వేఱుగనుండరాదు. ప్రార్థనాపరత్వ ముండవలెను. ఈనియమ కాఠిన్యమునకు జంకనివారే ప్రమాణమును గైకొని యాశ్రమమునఁ జేరిరి. పాపము, కస్తూరిబాయియేగాంధితీవ్రతకుఁదాళఁజాలకుండెను. పంచమునికైనను సేవచేయుట కేవగించుకొనరాదని భర్త శాసించుటచే నామె లోలోనఁ గుమిలిపోవుచుండెను. ఒక్కొక్కప్పుడు గృహకలహములుగూడఁ దటస్థించుచుండెను. భార్య దేహ మనఃప్రాణములు భర్త్రధీనములని ఇతరభారతీయ యువకులవలెనే నమ్మి ప్రథమ యౌవనమున గాంధి భార్యను గఠినముగ శాసించుచు చేయిజేసికొనెను. కాని యా పతివ్రత యబలత్వ కోమలత్వములచేఁ గరఁగి గాంధితానే యోడితి ననెడివాఁడు. తానునమ్మిన సత్యాగ్రహనియమములందుమాత్రము వీసమంతైన సడలింపులేదు. కాలక్రమమున, భార్యాభర్తలు లతావృక్షములవలె నొకటియైరి.

అస్పృశ్యతను దొలఁగించి పంచముల నాశ్రమమునఁ జేర్చినందునఁ బొరుగువారు గాంధిపై బహిష్కారప్రయోగము గావించి యిడుములఁగుడిపిరి. కొందఱు ధనసహాయము మానిరి. గాంధి సుడిగాలిలోని దీపమువలెనుండెను. కాని ఈ దీపము తైలదీపముగాదు, రత్నదీపము. దీనికారుటయనునది లేదు. ఒక త్యాగి యాశ్రమమునకు వచ్చి విశేషధనము

గు ప్రధానముగనిడి పోయెను. ఇట్టిసహాయములు క్రమముగఁ దాఁదొడఁగెను. గాంధి దేశసంచార మారంభించెను. రవీంద్ర నాథఠాకూ రీతని మిక్కిలి ప్రేమించి యీతనియందలి మహాత్వ లక్షణములను గనిపెట్టి యీతనిని మహాత్ముఁడనెను. నాఁటినుండియు వలదన్నను నీతని మహాత్మ బిరుదము లోక వ్యాప్తిగాంచెను.

ఆఫ్రికాలో బ్రయోగించి యుపసంహరించిన సత్యాగ్రహయుద్ధమును మరల బ్రయోగింప నవసరములు వచ్చెను. పూర్వము జనకమహారాజు పాలించిన విదేహ రాజ్యములో చంపారణ్యమను ప్రదేశముగలదు. అచ్చటి యనాగరికులగు రైతులు ఆంగ్లభూస్వాములచే మిక్కిలి యధోగతిపాలుచేయ బడిరి. దొరలకును రైతులకును నాచరణలోనుండిన క్రూర నియమములనుబట్టి, భూస్వాములు రక్త జలూకములవలె రైతులధనప్రాణములనుబీల్చి పిప్పిచేయుచుండిరి. రైతులు తమ భూములలోఁ గొంత భాగములోనీలిమొక్కలు పండించి నీలి యాకును స్వల్పమూల్యమునకుభూస్వాముల కిచ్చివేయవలెను. తమ దుర్భరస్థితిని జక్కఁజేసి ప్రాణముపోయుమని యచ్చటి బీదప్రజలు గాంధిని బ్రార్థింప గాంధి యచ్చటికిఁబోయెను. గాంధి నెవరును మోసగింపఁజాలరు. అతఁడు స్వయముగఁ బోయి పూర్తియైన విచారణచేసికొనికాని కార్యరంగమునకు దిగఁజాలనని చెప్పి, గ్రామగ్రామములకుఁ బోయి యిరుపక్షములవారిని మిక్కిలి యోపికతో వేలకొలఁదిమందిని విచారించెను. పంచాయితీల నేర్పాటుచేసి నివేదికలను సిద్ధముచేసెను.

పూర్వమునుండియు సుఖభోగులై యున్న దొరలకు గాంధి సన్నాహము గొడ్డలిపెట్టువంటి దాయెను. వారు పెక్కుడ్డంకు లను గల్పించిరి. ప్రభుత్వముచే గాంధిపై నిషేధాజ్ఞలను గురి యించిరి. రైతుల పక్షము న్యాయమని తలంచిన గాంధి సత్యాగ్రహభేషజమును బ్రయోగించెను. ప్రభుత్వపునిషేధా జ్ఞలనుధిక్కరించెను. రైతులు స్థిరసంకల్పులైరి. నిర్భయులై దమ యభియోగములను దెల్పిరి. ఈ యాందోళనముగాంచి ప్రభుత్వమువారుగూడ విచారణ సంఘమును నియమించిరి. భూస్వాములు లొంగివచ్చిరి. వందయేండ్లనుండియున్న కఠిన నియమములు దొలంగింపంబడెను. రైతుల యిక్కట్టులు దీరెను.

గాంధి ఆంగ్లమున 'యంగ్ ఇండియా' యనియు, హిందీలో 'నవజీవన్' అనియుం బ్రసిద్ధిగాంచిన పత్రికలను నడుపందొడంగెను. ఇతర పత్రికలవలె గాంధి తన వ్యాసము లకు స్వామ్యపు హక్కు దాంచుకొనలేదు. ఇందలి వ్యాసము లితరులుగూడం బ్రకటించుకొనవచ్చును. ఇంతేకాక వర్తక ప్రకటనలు, ఔషధ ప్రకటనలు మొదలగు వాని నీ పత్రిక లలోం బ్రకటింప నంగీకరింపక తన్మూలమున రాందగు వేల కొలంది యాదాయమును గాంధి వదలుకొనెను. సత్య సిద్ధాంతములను బ్రచారము చేయుటయే మహాత్ముని యాశ యము. అఖిలభారత సంఘసేవా సభను నెలకొల్పెను. మండలసభలను జరిగింపం దొడంగెను. ఇంతలో అహమ్మదా బాదులో మిల్లు పనివాండ్రధిక వేతనములకొఱకు సమ్మె

నారంభించిరి. తమ్మునుద్ధరింపుమని వారు మహాత్మునిగోరిరి. యంత్రాధికారులగు పెట్టుబడిదారులు తనకు రక్తబంధువులైనను గాంధి కూలివాండ్ర పక్ష మవలంబించి వారిని సత్యాగ్రహ కఠిన నియమములందు నడిపించెను. చాల దినములు పనిమానుటచే కూలివాండ్రు పెక్కుడుములు పడవలసివచ్చెను. దారిద్ర్య బాధ కాగజాలక వారిలో కొందఱు చలించి యంత్రాధికారులకు లొంగిపోనెంచగా గాంధి వారికొఱకు దా నుపవాస దీక్ష గైకొందుననెను. వారు మరలస్థిరులైరి. తుదకు కూలివాండ్ర కోర్కెలు నెరవేరునట్లు యజమానులకును వారికిని గాంధి సమాధానము కుదుర్చగలిగెను. గుజరాతులోని ఖేరామండలములో పంటలు పోయి రైతులు పన్ను లీయలేకపోగా గాంధివారి రక్షణకు బరుగెత్తి ప్రభుత్వమువా రెన్ని బాధలుపెట్టినను భూములను వేలము వేసినను బన్ను నీయవద్దని బోధించెను. ఇచ్చటను గూడ సాత్వికనిరోధము జయముగాంచెను.

ప్రజాదేహతత్త్వము నెప్పటికప్పుడు నాడిచూచు కొనుచున్న గాంధి భైషజ్యుడు, పరదాస్యామయమును నిర్మూలించుటలో దన సత్యాగ్రహౌషధ మమోఘమని నిదానముగ నెఱిగెను. స్వాతంత్ర్యము సిద్ధించునెడల దానిని జాగ్రత్తగ బాలించుకొనుశక్తి ప్రజలకు గలుగవలెను. ఈశక్తి గలుగుటకు యావద్భారత రాష్ట్రభాష ముఖ్యావసరమని గుర్తించి గాంధి దక్షిణభారతమున హిందీ భాషా ప్రచారముకొఱకొక సభ నేర్పాటు చేయించెను.

ఈ సభాబీజము క్రమముగఁ బెరిగి నేఁటికి మహావృక్ష మైనది. భారతదేశమున కంతటికిని హిందీ రాష్ట్రభాష యని నిర్ధారణమైనది.

1919 వ సంవత్సరము వచ్చినది. ప్రపంచసంగ్రామము అప్పటికి సమాప్తమైనది. ఆంగ్లేయులు జయించిరి. యుద్ధమున భారతీయులు గావించిన యపార జయమునకుఁ గృతజ్ఞతాభావముచేగాని, నూతన జయోత్సాహముచేఁ గాని యాంగ్ల ప్రభుత్వము భారతదేశమునకు స్వాతంత్ర్యదానము చేసికొని పుణ్యము గట్టుకొనునని యభిజ్ఞు లాశపడిరి. కాని యీ యాశలు నిరాశలాయెను. పైపెచ్చు పంజాబులో రౌలటుచట్టము మొదలగు ప్రజాస్వాతంత్ర్య నిరోధక శాసనములను బ్రజలపై రుద్దిరి. ప్రజల యోరిమికడలికిఁ గట్టలు తెగెను. గాంధి సత్యాగ్రహ సింహగర్జనలతోఁ బ్రజోత్సాహము వెల్లివిరిసెను. 'పోలీసు' ల యెఱ్ఱటోపీని జూచినంత సిండ్లలోదూరి దాఁగుకొను భీరువులకు పోలీసులన్నను, లాఠీ దెబ్బలన్నను దుపాకిగుండ్లన్నను భయము పటాపంచలై పోయెను. గాంధి ఏప్రిల్ 6 వ తేదీనుండి 13 వ తేదీ వఱకును సత్యాగ్రహవారము నాచరించుఁడని దేశమున కాదేశించెను. బ్రహ్మాండమైన సభలుజరిగెను. శాసన ధిక్కార దోషమునకుఁ బెక్కండ్రను బంధించి కారాగారములలోఁ ద్రోసిరి. మహాత్ముఁడు పంజాబును దర్శింపఁబోగా నారాష్ట్రపు సరిహద్దున నాయనను బంధించి బొంబాయికిఁ గొనివచ్చి విడిచిరి. సత్యాగ్రహవారపుఁ దుదిదినమున

పంజాబులో జలియన్వాలాబాగు అను తోటలోఁ బ్రజలాబాలవృద్ధముగ నుత్సాహసముద్ర నిమగ్నులై సభగూడి యుండ, నాంగ్ల నిరంకుశాధికార గర్వమూర్తియో యన్నట్టి 'డయరు' సేనాని యకస్మాత్తుగఁ బ్రజలపైఁబడి మాటిమసఁ నఁగ్లు నిర్దాక్షిణ్యముగ గుండ్లను బేల్చి బాలురని, యబలలని వృద్ధులని విచక్షణలేక వేలకొలఁది ప్రజలను జంపివేసెను. పాఱిపోవు చున్నవారిని బట్టి నేలను బ్రాకించి, కొఱ్ఱులఁగొట్టి చిత్రహింసలు గావించెను. ఈ యమానుష హింసావార్తలు దేశమునఁ గాఱుచిచ్చువలె వ్యాపించి, యవమాన భరమునఁ బ్రజల శిరస్సులు పాతాళమువఱకుఁ గ్రుంగిపోయెను. ప్రతిక్రియా రోషఘూర్ణమానులై నాయకులుపండ్లుగొఱికిరి.

పరిస్థితినంతను మననము చేసికొని మహాత్ముఁడు 1920 సంవత్సరములోఁ గలకత్తాలోఁ జేరిన జాతీయమహాసభలోఁ దన సహాయనిరాకరణ శంఖారావమును బూరించెను. చిరకాలమునుండి ప్రభుత్వమునకు వినతిపత్రములను బంపుకొనుటలో నలవాటుపడిన రాజకీయవేత్తలకీ క్రొత్త సిద్ధాంతమర్థముకాలేదు. కొందఱిది పిచ్చివాని ప్రలాపమనిరి. కాని మహాత్ముని తపోబల మహత్త్వమేమోకాని గాంధి వెంట నగ్నిగుండమున దుముకుటకుఁ బ్రజలు లక్షోపలక్షలుగ నడుములు బిగించి సన్నద్ధులయిరి. ప్రభుత్వమువారిచ్చిన బిరుదములను విడిచివేయవలెననియు వారిశాసనసభలను బహిష్కరింపవలెననియు న్యాయవాదులు న్యాయస్థానములను, విద్యార్థులును నుపాధ్యాయులును బాఠశాలలను, ఉద్యోగస్థులు

ప్రభుత్వోద్యోగములను బహిష్కరించి సత్యాగ్రహరంగమున యోధులుగ నిలువవలెననియు, విదేశవస్త్రములను బహిష్కరింపవలెననియు, మద్యపాన పిశాచమును పాఱద్రోలుటకుఁ గల్లుంగడులను బహిష్కరింపవలెననియు గాంధి తన యసహాయోగసిద్ధాంతమును వ్యాఖ్యానించెను. ప్రజాసహకారముమీఁదనే ప్రభుత్వము నడచునుగాన నా సహకారము నుపసంహరించినచోఁ బ్రభుత్వనిర్మాణము కూలునని గాంధి తలంపు. గాంధి యాదేశమును గ్రహించి విద్యార్థులును న్యాయవాదులును, బ్రభుత్వోద్యోగులును వెక్కండ్రు దమ పనులు మానిరి. ప్రభుత్వపుఁ గల్లుపాటలు జరుగకుండ నాపివేసిరి. విదేశవస్త్రము లమ్మకుండునట్లు బట్టల యంగడులయొద్ద గాంధి సేవకులు కావలికాచిరి. గుట్టలుగుట్టలుగ విదేశవస్త్రములను గాల్చివేసిరి. రాట్నములను నిర్మించి నూలుతీసి యాగర్భ శ్రీమంతులుగూడ ముతుక బట్టలుఁ గట్టిరి. ప్రభుత్వపు బొక్కసము వెలితిపడెను. ఇంగ్లండులోని వస్త్రవ్యాపారులు వడఁకిపోయిరి.

గాంధి మంత్రోచ్చారణచే విద్యార్థులు గూడ నుపన్యాసకులైరి. స్త్రీలు వంటగరిసెలు విడిచి స్వారాజ్య ధ్వజములు చేపట్టి సభారంగముల కెక్కిరి. కారాగారములకైనను బ్రాణబలికైనను బ్రజలు సంసిద్ధులైరి. మంటిలో నుండి మహావీరులను గాంధి లేవనెత్తెను. ఖద్దరును వ్యాపింపఁజేయుట, త్రికరణశుద్ధిగ నహింసాసిద్ధాంతమును పాలించుట. అస్పృశ్యతా నిర్మూలనము, హిందూ మహమ్మదీయ

మైత్రియను సంగములతోఁ గూడిన నిర్మాణ కార్యక్రమమును గాంధి దేశమందంతటను బ్రచారము చేయించెను. నాఁడు ప్రజలుచూపిన దేశాభిమానము, త్యాగబుద్ధి, కష్టసహనదక్షతయు నేనాఁడును భారతదేశ మెఱుఁగదు. పరిస్థితులు చేఁదప్పి తలమీఱుచుండెనని ప్రభుత్వము గుర్తించెను. ఇంగ్లాండునుండి యువరాజును భారతదేశమునకుఁ బంపి యేవియో యాశావాక్యముల నుచ్చాటనము చేయించినచో గాంధి భూత మెగిరిపోవునని ప్రభుత్వము భ్రమపడెను. యువరాజును బోనులోని సింహమువలె దేశమందంతటను ద్రిప్పిరి. ప్రభుత్వానుచరులకే యా రాజసింహపు దర్శనభాగ్యము లభించెను. దేశమందంతటను హరతాళములు జరిపి, అంగడులను గట్టివైచి యా ప్రభువును జూడఁబోక ప్రజలు దమ నిరసనమును దెల్పిరి. ప్రభుత్వమునకుడుకెక్కువై తీవ్రశిక్షలకు దిగెను. సభలు చెడగొట్టుట, గాంధి వస్త్రధారులను బాదుట, చెఱసాలలోఁ ద్రోయుట, కలుమానుఁడని ప్రచారముచేయు స్వచ్ఛందసేవకుల నోళ్లలో బలవంతముగాఁ గల్లుపోయుట మొదలగు వెఱపుగొలుపు చర్యలు మితిమీఱి జరిగెను. ప్రభుత్వపు దౌర్జన్యము పెచ్చుపెరిగిన కొలదియుఁ బ్రజల పట్టుదలయుఁ ద్యాగబుద్ధియు హెచ్చయ్యెను. ప్రభుత్వమునకు భూమిపన్నులుగూడ నీయ నిరాకరించిరి. కొంతకాలమునకుఁ దరువాత గుజరాతులో బార్డోలీ తాలూకాలోను, ఆంధ్రములో గుంటూరు మండలమునను పన్నుల నిరాకరణముగూడ జరిగించిరి. భూములు

వేలము వేసి పన్నులు రాఁబట్టుకొనవలెనని ప్రభుత్వము పన్నిన యెత్తులన్నియు విఫలములయ్యెను. ప్రభుత్వమునకు ధనము నిరాకరింపఁబడెను. కాని స్వరాజ్యనిధికి కోటిరూపాయలు ధనము కావలెనని గాంధి చేజాపినదే తోడుగ ప్రజలు కోటి రూప్యముల ధనము సమకూర్చిరి. నిజముగఁ బర ప్రభుత్వము కూలిపోవునని ప్రజలు విశ్వసించిరి. గాంధి యహింసామార్గము గొందఱ కర్థముగా లేదు. పోలీసులు పెట్టు బాధలకోర్వని ప్రజలు మతిచెడి, చౌరిచౌరాయను చోట, పోలీసులపై నెదురుతిరిగి వారినిజంపివైచిరి. ఈ వార్త గాంధి చెవులఁబడఁగానే అతఁడు దన సత్యాగ్రహాస్త్రము నుపసంహరించెను. ఒక నెలరోజులకు బిమ్మట 1922 వ సంవత్సరము మార్చి నెలలో గాంధిపై రాజ ద్రోహపు నేరము మోపిరి. న్యాయస్థానమున గాంధియిచ్చిన వాఙ్మూలమతిగంభీరము. నూలువడకుట దనవృత్తియనియు భారతదాస్యవిమోచనము దన ధర్మమనియు దానికొఱకై యెంత కఠినశిక్షకైనను సంసిద్ధుడననియు గాంధి తెల్పెను. న్యాయాధీశుఁడు ప్రభుత్వ న్యాయశాసనములనుబట్టి గాంధి కారేండ్లు కారాగారవాసము విధించెను. ప్రభుత్వముచే గాంధికి శిక్షాకాలము ముగియకముందే విడుదల లభించుచో నందఱకంటె నెక్కువగఁ దానానందింతునని యాతఁడు దెల్పెను. దేశమందంతటను వేలకొలది దేశభక్తులు బంధింపఁబడిరి. చెఱసాలలు నిండిపోయెను.

బందిలోనుండ మహాత్మునికొక ప్రాణాంతకవ్యాధి వచ్చెను. దానికి శస్త్రచికిత్స చేయవలసివచ్చెను. గాంధి

యేమగునోయని ప్రజలెల్లర హృదయములును దటతట కొట్టుకొనెను. నిరపాయముగ శస్త్రచికిత్స జరిగెను. ప్రభుత్వమువారు రెండేండ్లశిక్ష ముగియకముందే మహాత్ముని చెఱనుండి వదలిరి.

సత్యాగ్రహి కోటమియనునది లేదు. తాత్కాలికముగ కార్యదీక్ష సడలించినను, నొక్కొక్కప్పుడు శత్రువుతో సమాధానము నంగీకరించినను నది యోటమిగాదు. శత్రువునోడించి ఖిన్నునిగావించు తలంపుగాంధికిలేదు. ఆతనియందుంబరివర్తనము గల్గించి యుభయులును సుఖముగమనుటయే గాంధి యాదర్శము. శత్రువు నెదుర్కొను శక్తిలేక దెబ్బలకోడ లొంగుట సత్యాగ్రహ ధర్మముగాదనియు, సర్వ సమర్థుడై యహింసామార్గమున, గుండ్లకు రొమ్మొడ్డజూపువాడే నిజమగు సత్యాగ్రహియనియు గాంధినిర్వచించి యాచరించిచూపెను. జమ్నాలాల్ బజాజు, మోతీలాల్ నెహ్రూ వంటికోటీశ్వరులు దేశముకొఱకు గాంధిదాసులై చెఱసాలలలో మోటుకూడు దిని నేలను బరుండిరి. రాజేంద్రప్రసాదు, చిత్తరంజనదాసు, టంగుటూరి ప్రకాశము వంటి వేలకొలది ధనమార్జించు న్యాయవాదులు దమవృత్తులనువదలి దేశసేవాపరివ్రాజకులైరి. మహమ్మదాలీ, షౌకతాలీ సోదరులు గాంధి యడుగుజాడలలో నడచిరి. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య రామదండను స్వరాజ్యసేనను నడిపి తనవాగ్ధోరిలోఁ బ్రజాసామాన్యమును ముంచియెత్తి యొకమెట్టు తక్కువగా స్వరాజ్యసౌధము నెక్కించెను.

సత్యాగ్రహ ఝంఝూమారుతము కొంత శాంతించెను. మోతీలాల్ ప్రభృతులు శాసనసభలలో బ్రవేశించి, దుర్గము లోపలనే ప్రభుత్వమును జీకాకుపరతుమని గాంధి నొప్పించిరి. ఏటేట లక్షలకొలఁది సామాన్యప్రజలుకూడ జాతీయ మహాసభలకు బోవుచుండిరి. నిద్రాణమైయున్న జాతినంతను గాంధి యొక్క మాట కలఁచివేసి మేల్కొల్పెను. తమయందున్న వీరభద్రశక్తిని బ్రజలుచూచుకొనిరి.

భక్తునికిఁ బలుబాములుకుడిపికాని భగవంతుఁడు ప్రత్యక్షముకాడు. గాంధినిబరీక్షించుటకో యన్నట్లు హిందూమహమ్మదీయ కలహములు దేశమునఁ జెలరేగెను. సోదరులవలె బుజములుగలుపుకొని నడచినహిందూమహమ్మదీయ యోధు లొకరికుత్తుక లొకరు గోసికొని రక్తకాళికి బలియైరి. గాంధి యీవేదనకు మేఱలేక యాతఁడుపవాస వ్రతము గైకొనెను. తీవ్రోపవాస మిరువదియొక్క దినములు గడచెను. ప్రజల గుండెలు తల్లడిల్లెను. వ్రతఫలముగ హిందూమహమ్మదీయులు మనఃపరివర్తనము నొంది పరస్పర మైత్రీప్రమాణములను గైకొనిరి.

ఆరేండ్లపాటు స్వరాజ్యరథ మెగుడుదిగుడు నేలలో నడచెను. జవహరులాలు చెఱసాలలలో కాకలు దేఱెను. ప్రభుత్వపు లాఠీదెబ్బలచే మోటుబాఱెను. జాతీయమహాసభ కధ్యక్షుఁడై సంపూర్ణ స్వాతంత్ర్యలక్ష్యముఁ జేరువఱకును యుద్ధ విరమణము లేదని ప్రకటించెను. గాంధి సర్వ

నియంతయైన రాజ ప్రతినిధితో రాయబారములు నడిపెను. త్రాగుఁడు మాన్పించవలెననియు, భూమిపన్ను, ఉప్పు పన్ను, సైనిక వ్యయము, ఉన్నతోద్యోగుల జీతముల వ్యయమును దగ్గింపవలెననియు భారతీయ వస్త్రపరిశ్రమను రక్షింపవలెననియుఁ గొన్ని సంధి నియమములను రాజప్రతినిధికిఁ దెల్పెను. కాని ప్రభుత్వ మెక్కినగుఱ్ఱము దిగనందున గాంధి మరల సత్యాగ్రహాయుధమును జళిపించెను.

1930వ సంవత్సరము వచ్చెను. గాంధి యెత్తులాశ్చర్య జనకములు. అనుచరులకు దిగ్భ్రాంతి గొల్పును. ప్రజలకుప్పు పండించు నధికారము లేదుగాన నా నిర్బంధము నుల్లంఘించుట మొదటియెత్తుగా సంపూర్ణయుద్ధమునకు డీకొనదలఁచి సముద్రతీరమండలి ప్రభుత్వపు టుప్పుకొఠారులమీఁద దాడి జరుపుదునని గాంధి ప్రభుత్వమునకుఁ దెల్పెను. అతని చర్యలలో రహస్యమనునది యుండరాదు. గాంధి సన్నాహమును విన్న మేధావులందఱును బక్కున నవ్విరి. సముద్రపు టొడ్డున నుప్పురాళ్ళేరిన నేమివచ్చుననిరి. తమయుప్పుకొట్లను రక్షించుకొనుటకుఁ బ్రభుత్వమువారు సాయుధభటులను నిల్పిరి. చుట్టును ముళ్ళతీగలు బిగించిరి. కాని గాంధి రహస్యము వారికే మెఱుక! డెబ్బదియొక్క అనుచరులతో గాంధి పాదచారియై దండియను రేవునుజేరెను. దేశమందంతటను బాలురును, యువకులును వృద్ధులును నుప్పురాళ్ళేరుటకు సముద్రమునకుఁ బర్వెత్తిరి. నాఁటి యుత్సాహము చెప్పఁదరమా! చేపట్టినవి యుప్పురాళ్ళే. ప్రభుత్వపు

శిలాదుర్గము మొదలంట నూగిసలాడెను. ప్రభుత్వాజ్ఞలు బుగ్గిపాలాయెను. ఏమిచేయను దోఁపక ప్రభుత్వము తీవ్ర నిర్బంధ విధానమునకుఁ గడంగెను. గాంధిని బంధించిరి. దేశ నాయకుల నందఱను జెఱసాలలోఁ గ్రుక్కిరి. లక్షలకొలఁది యున్న గాంధిదండును బెట్టుటకు చెఱసాలలు చాలలేదు. తమ విధానము విఫలమని ప్రభుత్వమువారు గుర్తించి గాంధితో సమాధానము చేసికొని, బందీల నందఱను విడిచి పుచ్చిరి.

భారతదేశ సమస్యనుజర్చించుట కింగ్లండులో గుండ్ర బల్ల కూటమి నేర్పాటుచేసిరి. భారతరాజకీయ పక్షనాయకుల నాహ్వానించిరి. జాతీయమహాసభ కేకైకనాయకుఁడుగా గాంధియొక్కఁడే లండనునకేగెను. భారదేశ దారిద్ర్యచిహ్నముగ కటివస్త్రధారణ దీక్షనుగైకొనియున్న గాంధి యా వేషముతో నేయాంగ్లచక్రవర్తిదర్శనముచేసెను. భారతహృదయ క్షేత్ర చక్రవర్తి యాతఁడు. భూరాజ్యమునకుఁ జక్రవర్తి యాతఁడు. ఆంగ్లరాజనీతి చాణక్యులు సమావేశయత్నము భగ్నముచేసిరి. అల్పజాతీయసమస్య లను నురిత్రాళ్ళను భారతమాత కంఠమునకు బిగించిరి.

గాంధి యింటలేకుండఁజూచి భారతప్రభుత్వమువారెన్నో రాజకీయపుటెత్తులువేసి జనైక్యతను జెరచివైచి, గాంధి భారతదేశమున నడుగిడగానే యాతని బంధించిరి. మరల నాయకుల నందఱను జెఱలలోఁ గూల్చిరి. దేశ

మంతయు నొక పెద్ద చెఱసాలవలెఁ దోఁచెను. ఒకవైపున నిర్బంధాగ్నిని దరికొల్పుచు, నింకొకవైపున భారతజాతీయ మహావృక్షమునకు వేరుపురుగువంటి యల్పసంఖ్యాక సమస్యలను బైకెత్తి గాంధిగారి స్వాతంత్ర్య సంరంభము నార్పివేయ నాంగ్ల రాజకీయ ధురంధరులు క్రొత్తవ్యూహములఁ బన్నిరి. మహమ్మదీయులకును హిందువులకును సమాఖ్య కుదురకుండునట్లీర్ష్యా భావములు బలమగుచుండెను. హిందువులలోని వారగు నస్పృశ్యులను వేరొక యల్పసంఖ్యాక వర్గముగ నిల్పి వారికిఁ బ్రత్యేక నియోజకవర్గముల నేర్పఱుపవలెనని ప్రభుత్వము తలంచెను. అట్లయిన హిందూదేశమున నెన్నటికిని నైక్యతసమకూడదనియుఁ బరదాస్యము శాశ్వతముగ నుండుననియు దేశనాయకులు భీతిఁజెందిరి. ఈ తీరని విపత్తును గాంధిగారు గుర్తించి యస్పృశ్యులు హిందువులలోనివారే యనియు వారిని ప్రత్యేకవర్గముగ నిర్మించుచోఁ దాను ప్రాయోపవేశముచేసి ప్రాణము వదలుదుననియు ఇంగ్లండుమంత్రికిఁ దెలియఁజేసెను. గాంధి యుపవాసవ్రత మారంభించెను. దేశమంతయు దద్దరిల్లి పోయెను. ఉపవాసములో గాంధి ప్రాణవాయువు లెగిరి పోవుచో దేశములో నెట్టి యల్లకల్లోలము సంభవించునో యని ప్రభుత్వమును ప్రజలునుగూడ వెఱగొందిరి. అస్పృశ్యులను గాంధిగారు హరిజనులని పిలిచిరి. హరిజనుల యిబ్బందులను రూపుమాపుటకు బద్ధకంకణులగుటకును, వారికి శాసనసభలయం దధికస్థానములొసఁగి వారి యార్థిక,

వైజ్ఞానిక, రాజకీయస్థితిని జక్కఁబఱచుటకు హైందవ ప్రముఖులంగీకరించిరి. గాంధిగారియేర్పాటునకు అంబేద్కరు వంటి హరిజననాయకు లంగీకరించిరి. ప్రభుత్వమువారు విధిలేక గాంధిగారి నిర్ణయమునకు లొంగిరి. నాఁటినుండియు గాంధిగారు దమ రాజకీయ జీవితమునందు హరిజనోద్ధరణ మునకే ప్రాధాన్య మొసఁగిరి. హరిజనులపట్ల హిందూ పూర్వాచార పరాయణుల భావములను బరివర్తింపఁ జేయు టకు మహాత్ముఁ డుపవసించెను. హరిజనసేవకసంఘమును స్థాపించెను. హరిజన్ పత్రిక నారంభించెను.

1933 వ సంవత్సరమున మహాత్ముఁడు సమిష్టిసత్యాగ్రహమును నిలుపుదలచేసి వ్యక్తిసత్యాగ్రహమున కనుమతించెను. అప్పటినుండియు నించుమించుగ నాలేండ్లు మహాత్ముఁడు చెఱఁబడుట, యుపవాసములు, బందివిడుదల, రాష్ట్రములలో కాంగ్రెసు మంత్రివర్గములను నెలకొల్ప నంగీకరించుట, హిందీప్రచారము, దేశసంచారము,హరిజనోద్ధరణమునకు బిచ్చమెత్తుట మొదలగు వివిధరీతుల దేశసేవగావించెను. మహాత్ముని భిక్షాటన మపూర్వము. గృహనిర్మాణమునకో, వివాహమునకో, దేవాలయనిర్మాణమునకో, యజ్ఞాదులకో ధనమును యాచింతురు. కాని గాంధి హరిజనోద్ధరణమునకు ధనము సేకరింపఁదలఁచి, యాసేతుహిమాచలమును సంచారముచేసి కోటీశ్వరులనుండి భిక్షాధికారులవఱకును నెల్లరను యాచించెను. గాంధి చేయిచాపిన నీనివాఁ డెవ్వఁడు ? శిలా

హృదయములు ద్రవించెను. గాంధి హస్తములలో స్వర్ణ రాసులు గురిసెను.

గాంధిమస్తిష్కమునందును, ముఖమునందును నేయపూర్వ తేజమున్నదో గానిమహాప్రతిభాశాలులగురాజకీయ ధురంధరులెల్లరును గాంధియెదుట చంద్రునిముందు నక్షత్రములవలె నైరి. గాంధి యారాధన మారంభమాయెను. దేశమంతయుఁదనయొక్క నిమిాఁద నేయాధారపడరాదనియు, రాజకీయ విగ్రహారాధనము నిషిద్ధమనియుఁ జెప్పఁదలఁచి, కాంగ్రెసు సభ్యత్వమునుగూడ గాంధి వదలుకొనెను. కాని దేశము గాంధినివీడునా! అరదపుఁ బగ్గములను జేతఁబట్టకున్నను సారథియాతఁడే. ఇంతలో 1939 వ సంవత్సరములోఁ బ్రపంచ సంగ్రామ మారంభించెను.

ప్రజానుమతిలేని దే యాంగ్లప్రభుత్వమువారు భారత దేశమును బ్రపంచయుద్ధమున కీడ్చినందున నాలురాష్ట్రములలోఁ బరిపాలనము నడుపుచున్న కాంగ్రెసు మంత్రివర్గములధికారత్యాగము గావించెను. గాంధి ఆంగ్లేయులను గష్టకాలమున బాధించి నిర్బంధించి యధికారము లాగుకొను స్వభావము గలవాఁడుగాఁడు గనుక గౌరవసమాధానమునకు రాజప్రతినిధితో రాయబారమునడిపెను. కాని యధికారాహంకారమును యుద్ధోన్మాదమును పెచ్చుపెఱుగఁ బ్రభుత్వపుబుద్ధి పెడదారిని బట్టెను. యుద్ధజ్వాలలు భారతదేశమును సమిాపించెను. జపాను ప్రాచ్యదేశములను మ్రింగివైచి భారత

దేశముపై దుముక నుంకించెను. సుభాసుచంద్రబోసు వంటి మహానాయకుఁడు గాంధిగారి యహింసాపద్ధతి నంగీకరింపక, భారతదేశమును విడిచిపోయెను. ఆంగ్లరాజ్య శత్రువులతో సమాధానము చేసికొని వారితోడ్పాటున భారతదేశముపై దండెత్తి, దేశవిముక్తి గావింపవచ్చునని యెంచి, బోసు, బర్మా, మలయా దేశములలోఁ దిరిగి హైందవ జాతీయ సైన్యము నేర్పాటుచేసెను.

మహాత్ముని పద్ధతులు వేఱు. జపానువారు దేశము మీఁదఁ బడనున్నను, దేశమున హిందూ మహమ్మదీయ సఖ్యత కుదురకున్నను నాంగ్లేయులు భారతదేశమును విడిచి పోవునెడల హిందూదేశపుసమస్యలు వానియంతటనవి విడిపో గలవనియెంచి 'క్విట్ ఇండియా' యనగా 'భారతదేశమును వీడిపొండు' అను మంత్రము నాంగ్లప్రభుత్వముపై మహాత్ముఁడు ప్రయోగించెను. మంత్రగూఢార్థము నెఱుఁగని ప్రభుత్వమది పిచ్చివాని ప్రలాపమనుకొనెను. గాంధిని, భారతజాతీయ మహాసభా కార్యనిర్వాహకసభ్యులను, ప్రముఖనాయకులను నాకస్మికముగ బంధించి కారాగృహప్రవేశము గావించిరి. దిక్కుదోఁపని ప్రజలు ప్రభుత్వక్రౌర్యమును సహించుకొనఁ జాలక యహింసాసిద్ధాంతమును మఱచి, ప్రభుత్వమునుగూల ద్రోయ నిష్టమువచ్చినట్లు చెలరేగిరి. ప్రభుత్వభవనములపై దాడిచేసిరి. పోలీసులపై రాళ్ళురువ్విరి. రైలుపట్టాలు లాగి వేసిరి. ప్రభుత్వము అగ్నివర్షము గురియించెను. పెక్కుం డ్రమాయకులసువులఁగోల్పోయిరి. దౌర్జన్యపూరితవిప్లవము

గావించినందులకు వేలకొలంది భారతీయులు చెఱఁబెట్టఁబడిరి. అహింసా వ్యాజమున హింసాకాండకు దిగెనని కాంగ్రెసుపై నేరముమోపఁబడెను. కాంగ్రెసు దోషము గావింపలేదనియు, దేశములో గలిగిన హింసాకాండకుఁ బ్రభుత్వ నిరంకుశ చర్యలే కారణమనియు దెల్పి శాంతపరిస్థితులను నెలకొల్పుటకు మహాత్ముఁడిరువదియొక్క దినము లుపవాసముచేసెను. మహాత్మునికి ముఖ్యానుచరులును, బహిఃప్రాణములునునగు జమ్నాలాల్ బజాజు, మహాదేవదేశాయులు స్వర్గస్థులయిరి. 1944 సంవత్సరమున శివరాత్రినాఁడు మహాత్ముని ధర్మపత్ని కస్తూరిబాయిగూడ భౌతికదేహమును వీడెను. ఇన్ని కష్టముల మధ్య గాంధి హృదయదీపము చెక్కుచెదరక వెలుఁగుచుండెను. మహాత్ముని కారాగారముక్తుని గావించిరి.

## అవబృధము

ఇరువదినైదేండ్ల మహాత్ముని యాజమాన్యమున జరిగిన భారతస్వాతంత్ర్య యజ్ఞము ముగియవచ్చెను. దీక్షితుఁడు కృచ్ఛ్రచాంద్రాయణాదులచేఁ గృశించియుండెను. ఉపద్రష్టలును, సభాస్తారులును నగు భారతీయు లలసిపోయిరి. ప్రపంచ సంగ్రామము ముగిసెను. జర్మనీ జపాను లోడిపోయెను. ఆంగ్ల ప్రభుత్వమువారు యుద్ధమున జయించినను, గాంధి ప్రబోధమున జాగరితమై స్వాతంత్ర్యబుభుక్షచేఁ గర్జించుచున్న భారత సింహమును బంధించియుంచఁ జాలమనియు, నట్లుంచుట తమకే నష్టమనియు నెంచి, భారత

దేశ పరిపాలనాబాధ్యతను వదలుకొనఁ దలంచిరి. ఆంగ్లదేశ పరిపాలకవర్గములో మార్పులు గలిగెను. భారతనాయకుల నందఱను జెఱవిడిచి సిమ్లానగరములో రాజకీయసమాలోచనములకుఁ బిలిచిరి. ఆంగ్లేయులు భారతదేశమునకు స్వాతంత్ర్యమును బ్రసాదింపఁ దలఁచిన ట్లుదారాశయములను బ్రకటించుచున్నను దేశమును ఛిన్నాభిన్నము గావించి, ఐక్యతనునిర్మూలించి, స్థైర్యమును బీల్చి పిప్పిచేయు నూతన పిశాచములు విచ్చలవిడిగ బయలుదేఱెను. స్వదేశ సంస్థానములకును నాంగ్ల ప్రభుత్వమునకును నేవో యాంతరంగిక సంధి నియమము లున్నవను కారణమున వారు భారతైక్యత కంగీకరింపకుండున ట్లాలోచనలు బయలుదేరెను. పదికోట్ల మహమ్మదీయులలోనధికసంఖ్యాకులకు నాయకుడుగ నేర్పడిన జిన్నాకు బల మెక్కువాయెను. అతఁడు భారతదేశములో ముస్లిములకు బ్రత్యేకరాష్ట్రము గావలెనని భల్లూకపుఁబట్టు పట్టెను. ఈ క్రొత్తదయ్యముల నెదుర్కొనుటలో గాంధి క్షమాశాంతు లగ్నిపరీక్షకు గురియాయెను. భారతదేశమును హిందువులకును మహమ్మదీయులకును బంచివేయుట కంగీకరించుటకంటెఁ దన గుండెను జీల్చివేయుట కంగీకరింతునని యాయన చెప్పెను. ప్రత్యేక రాష్ట్రమియ్యనిచోఁ బ్రత్యక్షచర్యకు దిగుదునని జిన్నా బెదరించెను. ఆంగ్లదాస్యముకంటె ముస్లిములకుఁ బ్రత్యేకరాష్ట్రము నిచ్చుటయే కర్తవ్యమని గాంధియు నాతని వర్గమువారును విధిలేక యంగీకరింపవలసి వచ్చెను.

ముస్లిములు దమ హింసాశక్తిని ప్రదర్శించుటకును, సాధ్యమైనంతమంది హిందువులనుజంపివేసియో, బలత్కారముగఁ దమ మతములోఁ గలిపికొనియో హిందూ జనసంఖ్యను దగ్గించుటకు దలఁచిరోయన్నట్లును వంగదేశపు ముస్లిములు నారకక్రౌర్యములకుఁ బూనుకొనిరి. ముష్కరులు కలకత్తాలో నిండ్లు దగులఁబెట్టియు, ధనములుదోచుకొనియు, హిందూ స్త్రీ పురుషులనుబట్టి చిత్రహింసలు గావించిరి. వంగదేశమంతయు నారకాగ్నికుండ మాయెను. హిందువులు దమ యిండ్లను విడిచి పలాయనులైరి. పతితపావనుఁడును దీనరక్షకుఁడునునగు గాంధి యీ హింసాకాండ వృత్తాంతము విని కాతరరక్షణార్థము వంగదేశమునకుఁ బఱువెత్తెను. రాక్షసప్రాయులగు రక్తప్రాయులమధ్యఁ బాదచారియై దిరుగుచు కాలువలను దాటుచు నూరూర దిరిగి హంతకులను శాంతపఱచి హిందూ ముస్లిముల నైక్యతాబుద్ధిని నెలకొల్పెను. ఏ మతావేశపరుఁడైనను నొక రాయివైచి గాంధి ప్రాణము దీయునేమోయని భారతీయు లెల్లరును దిగులుచెందిరి. కాని భగవంతుఁడు వేయికండ్ల గాంధిని గాపాడెను. ముస్లిముల క్రూరచర్యలకుఁ బ్రతిక్రియగ బీహారులోని హిందువులు ముస్లిములను వధించి దారుణ చర్యలుగావించిరి. వెంటనే గాంధి బీహారునకుఁ బర్వెత్తి హింసల నాపివైచెను.

పడమట పంజాబు రాష్ట్రమును హిందువులకును సిక్కులకును ముస్లిములకును విభాగించుటలోఁ బ్రపంచ చరిత్రలో నెన్నటికిని మఱువరాని హింసాచర్యలకు మతా

వేశపరులు గడంగిరి. సిక్కులును, ముస్లిములును ఘోర వధలకు దిగిరి. ముస్లిములు పడమటికిఁ బాఱిపోయిరి. హిందువులును సిక్కులును దూర్పునకుఁ బాఱిపోయిరి. లక్షాధికారులు బిచ్చకులైరి. ఈ కాందిశీకులు పడిన బాములు ప్రసమునకే మొఱుక. ఈ క్రూర నారక బాధలన్నియు (పాకిస్థాన్) ప్రత్యేకరాష్ట్రనిర్మాణ ఫలితములు. స్వాతంత్ర్యప్రసూతికి ముందు భారతమాత దుర్భర ప్రసవవేదనమునకును, శస్త్రఖండనమునకును పాల్పడవలసి వచ్చెను. భారతమాత సుపుత్త్రుఁడగు గాంధి హృదయావేదనకు మేఱలేదు.

1947 సంవత్సరము ఆగస్టు పదునైదవ తేదీని స్వతంత్ర భారతమవతరించుటతో గాంధితలపెట్టిన త్రిదశవర్ష యజ్ఞము సమాప్తమై యవభృథస్నానమాయెను. నాఁడు భారతీయులు పొందిన యానందోత్సాహములు వర్ణనాతీతములు. కాని హింసలకు గురియై నిలువ నీడలేక దుఃఖసాగరమున మునిగియున్నవారిని దలఁచుకొని గాంధి విలపించి నిరాడంబరముగఁ దపశ్చర్యతో స్వాతంత్ర్య దినమును గడపెను.

## స్వర్గయాత్ర

భారతసేవాయజ్ఞారంభమున మహాత్ముఁడు మహాసంకల్పమునఁ బెట్టుకొన్న ముఖ్యాంశము లించుమించుగ ఫలవంతములైనవి. దేశమందంతటను మద్యపాననిషేధమున కేర్పాటులు జరిగినవి. హిందీ రాష్ట్రభాషగ నుండుట కేర్పాటులు జరిగినవి. గ్రామపరిశ్రమాభివృద్ధికి రక్షణ దొఱకెను.

హరిజనుల యిక్కట్టులను దొలగించుటకన్ని రాష్ట్రముల లోను ప్రత్యేకమంత్రు లేర్పాటైరి. హరిజన దేవాలయ ప్రవేశము దేశమందంతటను నించుమించుగ నెఱవేరినది. స్వాతంత్ర్యసిద్ధితోc బ్రభుత్వోద్యోగుల ప్రవర్తనము నందును బరివర్తనము గలిగినది. వారు తాము ప్రజాసేవకుల మని గుర్తింపఁబొడఁగిరి. ఇట్లు గాంధి తన జీవిత ప్రయోజనము నెఱవేర్చిన పిమ్మట నాతని నీలోకమున నుండనిచ్చుట కాతని యిష్టదైవమగు శ్రీరామచంద్రుని కిష్టము లేకపోయెను గాఁబోలును. నూటయిరువదియైదేండ్ల ప్రాయము వఱకుc బ్రజాసేవచేయుచు జీవింపనెంచుచుంటినని గాంధి దెల్పినను భగవంతుc డన్యథా తలంచెను.

పూర్వ పాకిస్థాను (ప్రత్యేక మహమ్మదీయరాజ్యము) బీహారులలో శాంతిభద్రతల నేర్పఱచి పడమటిపాకీస్థానునకుc బోవలెనని యే దుర్ముహూర్తమునందో మహాత్ముఁడు ప్రస్థానమునకు సంకల్పించెను. ఇంతలో ఢిల్లీనగరములో హిందువులు మహమ్మదీయులపైc గసిదీర్చుకొనుటకు హత్యలారంభించిరి. ముస్లిములనుబట్టి కొట్టి, వారి మసీదుల నాక్రమించి బీభత్సముగావించిరి. విసుగువిరామమును బ్రాణభీతియు నన నేమో యెఱుఁగని గాంధి వెంటనే యటకుఱికెను. తన విశ్వరూపమును గనుపఱచి ప్రజలమనోభావములను జూఱగొని హత్యాకాండను మాన్పివైచెను. రక్తపుటేఱులింకెను. ప్రాణముల కల్లాడిపోయిన ముస్లిములు గాంధికి జేజేలొసఁగిరి. మహాత్ముఁడు ఢిల్లీలో హిందూ మహమ్మదీయ సఖ్యతకొఱ

తుపవాసముగావించి, మహాత్ముఁడీయుల క్షేమమున కెన్నియో ప్రత్యేక రక్షణలను గావించెను. వారి యిండ్లను మసీదులను వారికిప్పించి వారు యథాప్రకారముగఁ బ్రార్థనలు జరుపుకొనునట్లు కట్టుదిట్టములుచేసెను. అల్పసంఖ్యాకుల కోర్కెలను దీర్చుట యధిక సంఖ్యాకులగు హిందువుల కర్తవ్యమనియు, ముస్లిములు దౌర్జన్యములఁగావించినను హిందువులు క్షమింపవలెననియు మహాత్ముఁడు శాసించుటయే యతని ప్రాణదీపము నార్పివేయు సుడిగాలిగఁ దాపురించినది. హిందువులు ప్రతిక్రియాశూన్యులుగను నిర్వీర్యులుగను బరిణమించుటకు గాంధియేకారణముగాన అతని నెంతత్వరలోఁ దుదముట్టించిన నంత శ్రేయమని కొందఱెంచి యా పాతకమున కొడిగట్టిరి. మతావేశము మానవుల నున్మాదులఁ గావించును. అది ప్రపంచాదినుండియు నెన్ని రక్తపాతములకును దారుణ యుద్ధములకును దారి తీయించ లేదు !

ఢిల్లీలో హరిజనవాడలో మహాత్ముఁడుప్రార్థనసమాజముల ననుదినమును సాయంకాలమున గావించెడివాఁడు. అందు భగవద్గీతనుండియు, బైబిలునుండియుఁ బ్రార్థనాసూక్తులను జదివెడువాఁడు. సర్వవిషయములపై మహాత్ముని భాష్యసూక్తులు దివ్యధ్వనులతో దేశమునందెల్లెడల మాఱుమ్రోగుచుండెడివి. గాంధి తత్త్వము సమగ్రముగ బోధపడుట యెట్టి ధీమంతులకైనను గష్టమే. ఆయన నర్థము చేసికొనఁజాలక యాయన వాక్యములు గొన్నియెడలఁ బరస్పర విరుద్ధములనిగొందఱు లోలోనఁ గొణుగుకొనెడివారు.

అందుచే గాంధి యార్థిక, ధార్మిక, నైతిక, సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక, విషయములందుఁ దన నిశ్చితభావముల నీ ప్రార్థనా సభల మూలమున విశదీకరించుచుండెను. రాజకీయమునకు ను మతమునకును బొత్తు కుదురదని యెల్లరనుకొందురు. కాని మత రాజకీయములకు రెండింటికిని ముడిపెట్టి వానిని బరస్పర బలవర్థకములు గావించినవారిలో గాంధియే ప్రధానుఁడని చెప్ప నగును. వ్యతిరేకాభిప్రాయుల నోళ్ళు బలవంతముగ మూసి వేయక హృదయపరివర్తనము వలనవారిని దనపక్షమునకుఁ ద్రిప్పుకొనుటకెట్టి త్యాగమునకైనను సంసిద్ధమగుటయే గాంధి తత్త్వము.

మహాత్ముఁడు భారతీయులకేమి, ఇతర బాధితవ్యక్తుల కేమి చెవులయందూదిన మంత్ర రహస్యము "భయ మన్న దానిని దరిఁజేరనీయకుము" అని. ఆతఁడు ధర్మమునకొఱకుఁ బ్రాణములర్పించు నంత్య ముహూర్తమువఱకును నెన్నఁడును భయమునకు లోనుగాక హంతకులకైనను గుండెనేచూపెను. జనవరి యిరువదియవ తేదీని మహాత్ముని ప్రార్థనా సమాజ స్థలమునకుగూడ వచ్చి హంతకులు మహాత్ము నుద్దేశించి 'బాంబు' ప్రేల్చిరి. ఇతరులెంత కల్లోలపడినను గాంధి చెక్కు చెదర లేదు. ఆతని ముఖమున సహజమగు చిఱునవ్వు కలఁత వడలేదు. ధర్మమునకొఱకు బలవన్మరణము ప్రాప్తించుట దన యభివాంఛితమే యని యాతఁడు దెల్పియుండెను. భక్తు లాతనికి రక్షణ సౌకర్యములను నేర్పాటుచేయుదుమన్న నాతఁ డంగీకరింపలేదు.

జనవరి ముప్పదవ తేదీని సాయంకాలమున మహా త్ముఁడు ప్రార్థనసభ కేతెంచుచుండెను. గాడ్సేయను నొక మహారాష్ట్రి హంతకుఁ డెదురుగవచ్చి "ఈనాఁడు మీరు సభ కాలస్యముగా వచ్చితిరే" యనెను. గాంధి చిఱు నవ్వుతోనే "ఔ నీవేళ కొంచె మాలస్యమైనది" యనుచు నుండగనే వందనము చేయు మిషతో వంగి హంతకుఁడు దన యంగరకాలోని పిస్తోలునుదీసి గాంధి యుదరముపై మూఁడుమార్లు ప్రేల్చెను.

'హే రామ' యనుచునే మహాత్ముఁడు! నేలకొరగెను గాని భయచిహ్నములేమియుఁ జూపలేదు. భారతదేశము దన చరిత్రలో నింతకంటె ఘోరపాప మెన్నఁడును జేసికొని యుండలేదు. శాంతిదూతను, కర్మవీరుని, సత్యదీక్షితుని, త్యాగధనుని చేతులారఁ జంపుకొన్నది. మేరువు కూలఁబడి నట్లైనది. హిమాచల మబ్ధిని గూలినట్లైనది. భారతజాతి గౌరవము పాతాళముఁ జొచ్చినది. నెహ్రూ పటేలులు మొదలు సామాన్య హరిజనుని వఱకును నా బాలవృద్ధమును అన్నపానములు నోటికిఁబోక కన్నతండ్రిని గోల్పోయినట్లు ప్రజలేడ్చిరి. జాతి తేజమే యస్తమించెనని నెహ్రూ విల పించెను. హంతకుల చేష్టలు గనిపెట్టఁజాలక, మహాత్ముఁడు దనకెట్టి రక్షణలును వలదనుచున్నను, దమ ధర్మనిర్వహ ణము కొఱకైనను మహాత్ముని ప్రాణమును రక్షించుకొన లేక పోయితిమని పటేలు విచారించెను. గాంధియాత్మ యాతని పైదడుగుల దేహమును వీడి యఖిల భారతీయ

ప్రజాహృదయ క్షేత్రములం దిముడుకొన్న దన్నవార్త ప్రపంచమందంతటను క్షణములో వ్యాపించెను. జార్జిసార్వభౌముఁడును దన విచారమును దెల్పెను. ఇతర దేశముల రాజులును, పరిపాలనా చక్రప్రవర్తకులును దమ దుఃఖమును దెల్పిరి. అహింసామాత కిట్టి యంతమా యని వెఱగుపడిరి. జరావ్యాధులచేఁ గృశించి బాధలొంది మరణించుట కంటెఁ దన జీవితప్రయోజనమును నెరవేర్చిన మహాత్మునికిట్టి మృతియే భగవదభిప్రేతమని పెద్దలనుకొనిరి.

గాంధి, రాజాధిరాజులు దమ దేహమును చాలించిన ఢిల్లీనగరములో ధర్మదీక్షలోఁ బ్రాణములు వీడుటెంతయు సమంజసము. లక్షలకొలఁది భారతీయు లేడ్పుమొగములతో బాటకిరువైపుల మైళ్ళకొలఁది దూరము బారులుతీర్చియుండ గాంధి మృతకళేబరమును యమునానదీతీరమునకుఁ జేర్చిరి. ఏమహారాజునకును నేనాఁడును నిట్టి గౌరవము జరిగియుండలేదనుటలో నతిశయోక్తిలేదు. పావన యమునాతరంగిణి దన తటమున రాజఘాటనుచోట మహాత్ముని మృతదేహమును దనయొడిలోఁ బరుండబెట్టుకొన్నది. చందనకాష్టములతోను గర్పూరపుఁ బలుకులతోను జితికి నిప్పంటించిరి. ఆనాఁడు భారతదేశమునఁ బురములందే కాక పల్లెపల్లెలందును బ్రజలు కాలువలకో, దటాకములకో యూరేగింపులతో బోయి గాంధి మృతాశౌచస్నానములను జేసి యిండ్లకు, మరలిరి. హిందూ మతకర్మవిధుల ప్రకారము గాంధికిఁ బారలౌకిక క్రియలు జరిగెను. అస్థిసంచయనము జరిగెను. గాంధి

యస్తులను వెండి బంగరు పెట్టెలలోఁ గొనిపోయి భారత దేశపు నదు లన్నింటిలోఁ బుణ్యతీర్థములలోఁ గలిపిరి. విదేశములకుఁగూడ నస్థికలములు గొనిపోయి నదులలోఁ గలిపిరి. గాంధి స్మారకచిహ్నము లింగ్లాండు అమెరికాలలోఁ గూడ నెలకొల్పఁ బడుచున్నవి. ఇట్టి విశ్వమానవ ప్రియుఁడు మరల నెన్నఁడైన నుద్భవించునా!

---

# నేతాజీ సుభాసుచంద్రబోసు

భారత స్వాతంత్ర్య యుద్ధచరిత్రయందుగాంధి నెహ్రూలతోఁ దులదూగు ప్రతిభాశాలి సుభాసుచంద్రబోసు. గమ్యస్థానమొకటియైనను గాంధి బోసుల మార్గములు వేఱువేఱు. గాంధికి సాధనసాధ్యములు సమపునీతములు. రెండింటిని రెండు నేత్రములతో నేకదీక్షతోఁ గాచుకొనువాఁడు. కాని బోసు దృష్టి గమ్యస్థానమునందు మాత్రమే కేంద్రీకృతము. యుద్ధమున కేవల ధర్మము శక్యముగాదు కాన రహస్యమార్గములచేఁగాని, బహిరంగమార్గములచేఁగాని, స్వశక్తిచేఁగాని, పరశక్తిస్వీకరణముచేఁగాని, ఆంగ్లప్రభుత్వమునోడించి భారత దాస్యవిమోచనము గావించుటయే యతని పరమాశయము. మహాత్ముని యందలిస్వాతంత్ర్య వాంఛాగ్ని మంత్రప్రేరితమై, నియమబద్ధమై, సత్యత్యాగహవిస్సుచే వెలుగు యజ్ఞవేదికాగ్నివంటిది. నేతాజీయందలిది యగ్నిపర్వతములో నుండి మింటికెగయు భీకరవహ్నివంటిది. బాల్యమునుండియు బోసు

భావములును చర్యలును నుచ్ఛృంఖలములు. ఇంటనేమి, బడియందేమి, రాజకీయరంగమునందేమి పరశాసనమునకుఁ దలవంచువాడుకాడు. స్వతంత్రతదీపటిమచే నగ్రమార్గమును దనకంద్లకుఁ దోచినట్లు దర్శించి నిర్ణయించుకొనువాఁడు.

మహాత్మునిపట్ల బోసునకెట్టి పూజ్యభావమున్నను నాతని మార్గము లీతనికి నచ్చలేదు. జవహరులాలునకుగాంధి మార్గములు కొన్నియెడల నచ్చకున్నను, నెదురు తిరుగక తత్త్వమెఱిఁగి సరిపెట్టుకొనువాఁడు, కాని బోసు అట్లుగాక, భారతి దాస్యవిమోచనమునకుఁ దన మార్గమును దుల్య ప్రయోజనకరమేయని నమ్మి, మహాత్ముని శిక్షకు గురియై దేశమునుండి నిర్గమించినాఁడు. అపాయములో శత్రువును జీకాకుపఱుపరాదను గాంధితత్త్వమును ద్రోసిపుచ్చి, యుద్ధ సమయమున జర్మనీయొక్కగాని, రషియాయొక్కగాని, జపానుయొక్కగాని సహాయ మభ్యర్థించి భారతావనినుండి మొదట నాంగ్లేయులను బాఱద్రోలుట రాజనీతియని బోసు గాఢముగ నమ్మెను. కావుననే గాంధిని ధిక్కరింపఁగలిగెను. ఇతఁడు ప్రాచ్యాసియాయందు స్థాపించిన తాత్కాలిక భారత ప్రభుత్వమును, భారతజాతీయ సైన్యమును జూచి యాంగ్లప్రభుత్వము వారు గొంతవఱకు వెఱపుఁ జెందియు, విసుగుఁ జెందియును భారతప్రభుత్వ బాధ్యతను వదలుకొన సంకల్పించి యుందురనుట కేవల సత్యదూరముగాదు.

బోసు జీవితపాఠములు భారత యువకుల కుద్దీపన కరములుగాన నాతని మహితజీవితచరిత్రమును జదువుదము.

భారతదేశమున వంగరాష్ట్రము పెక్కండ్రు మహా పురుషులను గన్న ఖ్యాతిగడించినది. మహాభక్తులగు చైతన్య గౌరాంగు లిందుద్భవించిరి. మతప్రవక్తలగు శ్రీరామకృష్ణ పరమహంస వివేకానందులిచ్చటివారే. సంఘసంస్కర్తలగు రాజారామమోహనరాయలును టాగోరుకుటుంబమును గని పెంచిన దీ రాష్ట్రమే. భారతస్వాతంత్ర్యసమర ప్రాథమిక దినములలో దేశవిఖ్యాతిఁజెందిన బిపినచంద్రపాలు, సురేంద్ర నాథ బెనర్జీ, అరవిందబోసు లీ రాష్ట్రమున నుద్భవించినవారే. మహాత్మునికి వంగరాష్ట్ర సామంతరాజుగ నుండిన చిత్త రంజన దాసిక్కడివాఁడే. స్వాతంత్ర్యసమరభేరులు మ్రోగఁ గనే నడుములు బిగించి నిలుచువారు వంగదేశీయులేయైనను వారు సాధారణముగ యుద్ధప్రియులు; శౌర్యమార్గావ లంబకులు. గాంధి మొదటఁ గలకత్తాలోఁ దన స్వాతంత్ర్య ఢక్కను మ్రోగించినపుడా మ్రోతను విని యుత్సాహ పులకితులై ప్రతిధ్వనించిరి. కాని గాంధి యహింసా సాత్విక నిరోధమార్గములను సరిగఁ బాలింపలేరేమోయని నాఁడును శంకించిరి. నేఁటికిని శంకించుచున్నారు. ప్రచ్ఛన్న రౌద్ర విప్లవమన్న వంగీయులకు బాగుగ నచ్చును. అట్టి రాష్ట్ర మున నిరువదినాలుగుపరగణాలను మండలమున కొడాలియా గ్రామమున జానకీనాథబోసు అను నొక న్యాయవాదిగలఁడు. ఆయన పత్ని ప్రభావతీబోసు. వీరిది కాయస్థకులము. కాయస్థులనగా గణకులు, లేఖకులు. వీరి వృత్తినిబట్టి వంగ దేశమున కాయస్థులను పేరున నీతెగవారు నేఁటికినిఁగలరు

జానకీనాథుఁడు న్యాయవాదవృత్తి సాగించుటకు ఒరిస్సా రాష్ట్రమునందలి కటకము నగరమును జేరెను. బుద్ధి బలమును బ్రయోగించి విశేష ధనమును, బలుకుబడిని నార్జించువారు న్యాయవాదులు. మహాత్ముఁడును నాతని యనుచరులలో బెక్కండ్రు మేటి పోటుబంటులును న్యాయవాదులే. జానకీనాథుఁడు విశేషధనము నార్జించి రాజభోగ జీవితమును గడుపుచుండెను. పురపాలకాధ్యక్షుఁడుగఁ గొంత ప్రజాసేవ గావించెను. ఈయన కెనమండుగురు పుత్రులును నైదుగు రాఁడుపిల్లలును గలరు. వారిలో నాఱవపుత్త్రుఁడగు సుభాసుచంద్రుడు కటకములో 1891 వ సంవత్సరము జనవరి యిరువదిమూఁడవ తేదీని జన్మించెను. ఎల్లరు బాలురవలెనే యన్నదమ్ములతోను నిరుగుపొరుగు వారితోను నాటపాటలలో సుభాసు వినోదించుచుండెడివాఁడు గాని యితఁడు వెనుకఁబడియుండక నలుగురిలో మొనగాఁడుగ నుండెడివాఁడు. రవీంద్రనాథఠాకూరు వంశస్థులు జమీందారులు. కాన వారికి నాభిజాత్యాభిమాన మెక్కువగా నుండి, సామాన్యబాలురతోఁ గలిసినఁ దమదమవంశౌన్నత్యమునకు న్యూనత గలుగునని, బాలరవీంద్రుని బయటికిఁ బోనిచ్చెడివారుగారఁట. కాని సుభాసట్లు పెరుగలేదు. తండ్రి వృత్తిని బట్టి కొంత వంశాధిక్యత యున్నను నితరబాలురతోఁ గలిసి వారిలో నాయకత్వము వహించువాఁడు. ఈతఁడు సుంద్రని ముఖమును, విశాలఫాలమును, వృషస్కంధమును గలిగి ఆజానుబాహుఁడై మనోహరాకృతి గలవాఁడు.

బోసునకు విద్యాభ్యాసము చక్కఁగనడచెను. సహజముగ సూక్ష్మగ్రాహి. మంచి ధారణాశక్తిగలవాడు. గంటలకొలఁది పాఠములు వల్లెవేయనక్కర లేకయే విషయములను జ్ఞాపకమునందుంచుకొనుచుఁదోడిబాలురతో నిపుణముగ వాదనలుగావించువాఁడు. 'న్యూఆర్ట్సుస్కూలు' అను నాంగ్ల పాఠశాలలో విద్యాభ్యాసము గావించెను. బాలుర యదృష్టవశమున నుత్తమాదర్శప్రేరితులగు నుపాధ్యాయులు లభించినచో వారి ప్రభావము విద్యార్థుల జీవిత పద్ధతులందు గాఢలక్షణములను నెలకొల్పును. బోసు అట్టి యుత్తమాదర్శములలో నే పెరిగెను. ప్రాతగోఁతయుఁగ్రొత్తవింతయును గనుక విదేశీయ వస్త్రధారణమును ఆడంబరజీవితపద్ధతియును బోసు మనము నాకర్షించెను. తరగతిలో నగ్రయాయిగ నుండెడివాఁడు. 1912 వ సంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షయందు త్తీర్ణుఁడాయెను. బాలుర జీవితలతకు దోహదము గావించుటకుఁ బాఠశాల యెంత ముఖ్యమో గృహమును నంత ముఖ్యమే. బోసు వీరగాథలనుబెక్కింటి నాసక్తితోఁజదివెడివాఁడు. తానును మహావీరుఁడుగఁ బ్రఖ్యాతుఁడుగా వలెనని యుబలాటపడెడివాఁడు.

సామాన్య విషయములకంటె నద్భుత విషయములు బాలుర మనములను బాగుగ నాకర్షించును. శ్రీరామకృష్ణ పరమహంస, వివేకానందుల జీవితములు మరులుగొల్పుటచే బోసు పెక్కు మతగ్రంథములనుదివుటతోఁజదివెను. సూక్ష్మముగ భ్రమసిపోవుటయు, దూరదృష్టితోను, శాంతివివేకము

ంతోను, వివేచన చేయలేకపోవుటయు బాల యువకలక్షణ
ములుగాన బోసొక్కొక్కప్పుడు దానును త్యాగియై యోగియై
దన దేశగౌరవమును బెంపొందింప శీఘ్రమార్గాన్వేషణము
నకుఁ గడంగెడివాఁడు. ఇంట బ్రాహ్మసమాజ ప్రార్థనలు
జరుగుచుండెడివి. జానకీనాథుఁ డధ్యక్షతవహించువాఁడు.
బోసును దీవ్రాసక్తితోఁ బాల్గొనెడివాఁడు. ఈ మతాభినివే
శము ముదిరి భారతీయమతమే యుత్కృష్టమనియు, పాశ్చా
త్యానుకరణ మేనాఁటికైన బహిష్కరణీయ మనియు
నాతఁడు దలఁచెడివాఁడు.

బోసు కళాశాలావిద్యార్జనకుఁ గలకత్తాలోని రాజధానీ
కళాశాలలోఁ జేరెను. ‘వందేమాతర’మను నుద్యమము
వెనుకఁ బట్టినను బిపినపాలు ఉపన్యాసముల విద్యార్థుల నుఱ్ఱు
కెత్తించుచుండెను. చిత్తరంజనదాసుగూడ రాజకీయ విజ్ఞాన
మును గుఱించి యుపన్యసించుచుండెను. ఆంగ్లేయుల పరిపా
లనా మూలమునను, వర్తకరూపమునను భారతదేశము
నెట్లు కొల్లగొట్టుకొని పోవుచుండిరో యెల్లరకు దెలియు
చుండెను. భారతీయులు నడుములువిఱిగిన త్రాచులవలె
బుసలుగొట్టుచుండిరి. హింసాయుత విప్లవమును బ్రచ్ఛన్న
ముగ సిద్ధము చేయవలెనని బోసు దనమనమున నూహించు
చుండెను. కాని ప్రభుత్వపు గూఢచార చక్రమునుండి
దప్పుకొని ముందునకు సాగుటెట్లు? ప్రజల కాలుసేతులు
బంధింపబడినట్లుండుటచే బోసు రాజకీయరంగమున నిరాశఁ
జెంది, బ్రహ్మవిద్యనుబొంది తేజశ్శాలి కావలెనని యొకనాఁ

డనుకొనెను. బ్రహ్మవిద్య బజారునదొరకునదికాదు. పుస్తక పఠనమువలనఁ జేపడునదికాదు. కాన సర్వాన్వేషణార్థి మిలువీడి బోసు బయలుదేరినాఁడు. తీర్థములును, వనములును, మఠములును దర్శించినాఁడు. వైరాగులను యోగులను బ్రతిమాలినాఁడు. ఉపవాసములచేతను యోగాభ్యాస క్రియలచేతను శరీరమును గష్టపెట్టెను. కాని బోసు భావించిన దివ్యదర్శన మెచ్చటను దృగ్గోచరముకాలేదు. విసిగి యింటికిఁజేరి తన యుద్రిక్త భావములకు బశ్చాత్తప్తుఁడై అశ్రుతర్పణముచే బాపక్షాళితుఁడై మరల కళాశాలవిద్య నుపక్రమించెను.

1915వ సంవత్సరములో బోసు కళాశాలలో ఎఫ్.ఏ. పరీక్షలో నుత్తమశ్రేణిలో నుత్తీర్ణుఁడయ్యెను. అమితకార్యోత్సాహి గనుక 'వివేక' పత్రిక నొకదానిని స్థాపించి ప్రజాసేవోద్బోధము గావించుచుండెను. ప్రజాసేవయే పరమాత్మసేవయని నమ్మినవారిలోఁ బ్రథముఁడుగానఁ గార్యోత్సాహముతోఁ బొంగులు వాఱుచున్న బోసును నియమములలోఁ బెట్టియుంచుట గష్టమాయెను. కళాశాలలో ఓటన్ అను నొక యాంగ్లోపన్యాసకుఁడు గలఁడు. ఆంగ్లేయులు ప్రభుత్వజాతిలోని వారుగాన నీ యుపన్యాసకునియందు జాత్యహంభావము హెచ్చుగనుండెను. ఎంతవిజ్ఞానియైనను జాత్యహంభావము గలవాఁడౌచిత్యమును మీఱుటసహజము. ఓటన్ దొర హిందూవిద్యార్థుల నీసడింపుతోఁ జూచుచుండెను. స్వజాతి గౌరవదీక్షితుఁడగు సుభాసు ఓటను ప్రవర్తనను

సహించుకోనఁజాలక విద్యార్థులం దుద్రేకముఁ బురికొల్పి వారిచే సమ్మెకట్టించెను. సుభాసు నాయకత్వమున సమ్మె ప్రబలతరముగ సాగుటచేఁ గళాశాలాధికారు లుపన్యాసకు నికిని విద్యార్థులకును సమాధానము గుదిర్చి సమ్మె నుప సంహరింపఁ జేసిరి. కాని ఓటను ప్రవర్తనలో నిజపరివర్తనము గలుగలేదు. మరల నాతఁడు విద్యార్థులను దూషించుటయు దండించుటయు సాగించెను. తిట్టునకుతిట్టు దెబ్బకు దెబ్బయు నొప్పచెప్పు తత్వమువాఁడు బోసు. ఉపన్యాసకుని దూషించి ముట్టడించెనను నేరమునకుఁ గళాశాలాధికారులు బోసుపై మూడేండ్లు బహిష్కారశిక్షను విధించిరి. కొంతకాల మిట్లుతని విద్యాభ్యాసమున కంతరాయము గలిగెను.

బోసు మఱొకకళాశాలలోఁ జేరి 1919 వ సంవత్సరమున బి. ఏ. పరీక్షలోఁ గృతార్థుడయ్యెను. నాటికి ప్రపంచ సంగ్రామము ముగియుటయు, నాంగ్లేయులు జయలక్ష్మీకర గ్రహణానందమున భారతీయుల స్వాతంత్ర్యాశలను నిర్మూలము గావించుటయునేగాక కొన్ని కఠిన శాసనములను బ్రయోగించుటయు మొదలిడిరి. భారతీయాత్మగౌరవమునకు సమ్మెట దెబ్బలు తగులుచుండెను. అధికార ధిక్కారమునకుఁ బ్రజలు ముందంజ వైచుచుండిరి. గాంధిగారు కార్యరంగమున కుఱికిరి. స్వాతంత్ర్యవారోత్సవముల నాచరింపఁ బ్రజల నుద్బోధించిరి. పంజాబులో జలియన్వాలా బాగు తోటలో డయరుద్వార గుండ్లు ప్రేల్చి వేలకొలఁది భారతీయులను హతమార్చి వేసెను. గాంధి, నెహ్రూ చిత్తరంజన

దాసులు ప్రేతాగ్నులవలె వెలుగుచుండిరి. దేశము దీపావళి మందు కొట్టువలె నుండెను. కల్లోలసమయమున బోసును భారతదేశమున నుంచుటకంటె నాంగ్లదేశమునకుఁ బంపుట మేలని తండ్రియెంచి, ఐ. సి. యస్. పరీక్షకుఁజదువు నిమిత్త మాతని నింగ్లాండునకుఁ బంపెను.

దూరదేశమున నుంటచే బోసు భారతదేశ స్థితిని ప్రత్యక్షముగఁ జూడలేదుగనుకఁ దన పరీక్షావిషయములను జాగ్రత్తగనే జూచుకొనుచుండెను. కాని పత్రికాముఖాలను నను, నుపన్యాసమార్గమునను స్వదేశస్థితి నరసికొను చుండెను. స్వతంత్రదేశము గనుక నింగ్లాండులో వాక్స్వాతంత్ర్యము గలదు. రాజకీయోపన్యాసములను నిషేధింపరు. సరోజినీదేవి యుపన్యసింపగా బోసు విని తన చదువును విడిచి ఇండియా నిప్పులగుండములో దుముక నెంచినాఁడు. కాని యెట్లో యోరిమిపట్టి పరీక్షయందు త్తీర్ణుఁడైనాఁడు. ఇంకనుఁ గొన్ని ప్రత్యేకపరీక్షలను గూడ ముగించుకొని 1921 వ యేట మాతృదేశమునకుఁ దరలినాఁడు. బోసువంటి వాని నుద్యోగశృంఖలములలో బంధించుట మేలని ప్రభుత్వమువా రాతనికి మండలాధిపత్యోద్యోగమును జూపిరి. కాని బోసు దానిని నిరాకరించెను.

## రాజకీయరంగము

సుబాసు బొంబాయినగరమున మహాత్ముని దర్శించి యాయన రాజనీతి తత్త్వమున మొదటిపాఠము వినెను.

గాంధితత్త్వము బోసువంటి యుగ్రవాదికిఁ బూర్తిగనచ్చదు. కనుక నాతఁడు కలకత్తాలో చిత్తరంజనదాసున కనుచరుఁడుగఁ గుదిరెను. దాసు దన యనుచరుని శేముషీప్రజ్ఞలను గుర్తించి యతనిని క్రమమార్గమున నడుప నెంచెను. గాంధి యుద్యమతీవ్రత దాసునకుఁగూడ చేయి మీఱెను. దేశమం దంతటను సత్యాగ్రహజ్వాల లంటుకొనెను. ప్రజలలో నొక్కుమ్మడి రాజకీయ చైతన్యము పైకుబికెను. ఉద్రిక్త ప్రజలు విదేశవస్త్రములు రాసులుగఁ బెట్టి నిప్పంటించుచుండిరి. చేతినూలు బట్టలు దివ్యవస్త్రములాయెను. మద్యపాయులను కల్లంగడులకుఁ బోనీకుండ స్వచ్ఛందసేవకులు కావలిగాచి, బోధించుచుండిరి. ఆంగ్ల ప్రభుత్వమువారు యువరాజును భారతదేశ పర్యటనార్థము పంపిరి. ఆతఁడెక్కడికిబోయిన నక్కడ నల్లజెండాలు తోఁకచుక్కలవలె నెదురాయెను. యువరాజబహిష్కరణ కార్యక్రమములోఁ గలకత్తానగరమున బోసుముందున కుఱికెను. నాయకులు చెఱసాలల పాలైరి. సుబాసునకు ఆఱునెలల కారాగారవాస శిక్ష ప్రసాదింపఁబడెను. ఐచ్ఛికముగనిక్కట్టులను వరించువారికి చెఱసాలయన్న భయమేముండును. చిత్తరంజనదాసు, సుబాసుబోసు వంటివారున్నది చెఱసాల యెట్లగును! 'జైలు మాకుస్వర్గము, ఖైదీలు బంధువర్గము' అని స్వాతంత్ర్యవీరులు యుద్ధగీతములు పాడుచుండిరి. చెఱసాలలకు శ్రీకృష్ణజన్మస్థానములని గౌరవనామము గలిగెను.

ఆఱునెలల శిక్షాకాలము గడచి బోసు బయటఁ బడెను. 'వసుధైవ కుటుంబక' మ్మనుకొనువారికి సేవాప్రకాశములకుఁ గొఱఁతయేముండును. దేశములో వఱదలు వచ్చి చాల నష్టము గలిగెను. బోసుస్వచ్ఛందసేవకసమితి నొకదానిని నెలకొల్పి బాధితులకు సేవచేయఁదొడఁగెను. ఉబుకుచున్న యౌవనము; ఎదుట స్వాతంత్ర్యలక్ష్మినృత్యము; వీరులు మైమఱచి బఱుగులెత్త కుండుటెట్లు! రాత్రింబగళ్ళు సేవాకార్యనిమగ్నుఁడై బోసు లక్షలకొలఁది ధనమును ప్రోగుచేసి వ్యయించెను. చిత్తరంజనదాసు 'ఫార్వర్డ్ బ్లాక్' అను నాంగ్లపత్రికను బ్రకటింపమొదలిడెను. పత్రికా నిర్వహణమునకుం దగిన కార్యదక్షుఁ డుండవలెను. అందఱిలో బోసు తగినవాఁడని యెంచి పత్రికానిర్వహణ భారమంతయు దాసీతనిపైఁ బెట్టెను. సేవా ప్రధానుఁడుగాన నెలకు మూఁడు వేల రూప్యములు వేతన మిచ్చెదమన్న నిరాకరించి బోసు పదునైదు వందల రూప్యములుమాత్రము గ్రహించుచుఁ బనినడుపుచుండెను.

స్వరాజ్యసంపాదనకు గాంధిగారు పెట్టిన గడు వతిక్రమించెను. ప్రజలాయన విధించిన నియమము లక్షరాలఁ బాలింపలేక పోయిరి. బోసువంటి కార్యవీరునకోరిమి సడలుచుండెను. కాని గాంధిమార్గముతప్ప మఱియొకటి సాధ్యమైనట్లు తోఁపనందునఁ బదునైన వ్రాతలతోను బ్రచార ప్రబోధములతోను బోసు విప్లవజ్వాలల నూదుచుండెను. పాశ్చాత్యులు భారతీయులను స్వదేశమున బానిసలుగను

విదేశీయ సంప్రదాయ వ్యామోహితులుగను జేసివేసి యార్థిక మస్థితి దెచ్చి పెట్టిరని యతఁడు బోధించెను. బోసు సేవా సక్తినిబట్టి ప్రజలాతనిని గలకత్తా నగరపాలక సంఘాధ్యక్షు నిగ నెన్నుకొనిరి. బయటనున్న బోసు ప్రమాదకారియని తలఁచి ప్రభుత్వము వారతనిని 1924 వ యేట బంధించి మాండలేకోట చెఱసాలలోఁ బెట్టిరి. ఈ కోటలోనే లోక మాన్యతిలకు మహారాజు ఆతేండ్లు కారాగారవాస మనుభ వించెను. బంధితుఁడయ్యును బోసు ప్రభుత్వమునకు సింహ స్వప్నమాయెను. ఆ ప్రదేశమందలి యుష్ణోగ్రత చేతను, దుర్గంధముచేతను బోసు ఆరోగ్యము చెడెను. అతఁడు చెఱ సాలలో నిరాహారదీక్షకుఁ బూనెను. బోసు విడుదల కొఱకు గొప్ప యాందోళనము చెలరేగెను. చెఱలోనుండఁగనే వంగ దేశీయులాతనిని శాసనసభల కెన్నుకొని యాకారణముచే విడుదల కోరిరి. ఇంతలో బోసునకు వ్యాధి సంభవించెను. వైద్యులాతని బరీక్షించి యపాయస్థితిని బ్రకటించిరి. ప్రభు త్వమువారాతనిని 1927 వ సంవత్సరమున విడుదలచేసిరి.

చెఱలోపలను వెలుపలనుగూడ దేశస్థితి యొకేతీరున నుండెను. ప్రభుత్వ దండకాఠిన్యమునకు మేఱలేకుండెను. ప్రజలను గొట్టి హింసించుచుండిరి. చిత్తరంజనదాసు సర్వస్వుఁ డాయెను. అగ్రరాజకీయవేత్త లోకస్వాతంత్ర్య నివేదికను సిద్ధముచేసి ప్రభుత్వమునకుఁ దెల్పిరి. అది మహాత్ముని యొప్పుదలతో మోతీలాలు నెహ్రూ పెత్తనమున జరిగినది. ఆ నివేదికయందు భారతదేశమునకు 'అధినివేశ ప్రతిపత్తి'

నొసఁగినఁ జాలునని తెల్పఁబడెను. బోసునకీ సగము సగము బేరము నచ్చలేదు. జవహరులాలును బోసును నేకాశయులై సంపూర్ణ స్వాతంత్ర్యమే దమలక్ష్యమని దెల్పిరి. కాంగ్రెసంతయు గాంధిగారి గుప్పిడిలోనుండెను. ఆయన నెదిరించి నెగ్గి బయటఁబడు వాఁడు లేడు. సుభాసొకఁడే సాహసముతో గాంధితీర్మానముల నెదిరించుచుండెను. ప్రభుత్వపు గుండెపై సమ్మెట దెబ్బలు గొట్టుచున్నను, గాంధి గౌరవసమాధానమున కెప్పుడును సన్నద్ధుఁడగుచునే యుండెను. ఆయన బేరగాఁడుగను గోమటిగను నుండుట బోసునకిష్టములేక గాంధిగారి కనీసపు కోర్కెల తీర్మానమును బోసెదిరించెను. కాని విఫలుఁడయ్యెను.

గాంధి యుద్యమమునఁ జైతన్యోద్రేకములు జెందని వారులేరు. ఆయన రేకెత్తించిన యుద్రేకమాయనకే పట్టశక్యము గాకుండెను. విద్యార్థిలోకము మేలుకొనెను. విద్యార్థులే భావికాలపు పౌరులుగాన సంపూర్ణ స్వాతంత్ర్యతృష్ణను వారియందుఁ బెంపొందించుటకు బోసు నాగపూరు, లాహోరు మున్నగు పట్టణములలో విద్యార్థిసభలలో నుపన్యసించెను. లాహోరులో జరిగిన భారతజాతీయ మహాసభలో సంపూర్ణ స్వాతంత్ర్యమే దమ లక్ష్యమనియుఁ దల్లక్ష్యసిద్ధికై ప్రజావాంఛను నెఱవేర్పఁడనియుఁ బ్రభుత్వమునకొక వినతి తీర్మానమును బంపఁదలఁచిరి. విజ్ఞప్తుల మార్గము ద్రోసివుచ్చి స్వశక్తితో స్వాతంత్ర్య ప్రభుత్వము స్థాపించుకొందుమని ప్రభుత్వమునకుఁ దుదిమాటగఁ

జెప్పివేయవలెనని బోసు పట్టుపట్టెను. కాని బోసుమాట నెగ్గలేదు. భారతజాతీయ మహాసభాధ్యక్షుఁడే తన కార్య నిర్వాహక వర్గమును బేర్కొను నాచారము గలదు. ఈ యాచారము వీడి కార్యనిర్వాహక సభ్యులను మహా సభ వారెన్నుకొను నాచారమును బ్రవేశపెట్టవలెనని బోసు తీర్మానము దెచ్చెను. కాని యధ్యక్షుని కనుకూలమైన కార్యనిర్వాహక వర్గముండినఁగాని యైక్యతయుండఁజాలదని, బోసు తీర్మానమును ద్రోసివేసిరి.

1930 లో గాంధిగారి యుప్పు సత్యాగ్రహము దేశ మందంతటను నంటుకొనెను. దేశభక్తులు పెండ్లివిందులకుఁ బోయినట్లు చెఱసాలలకేఁగిరి. ఈ యుద్యమమున నుఱికిన బోసుకుఁ దొమ్మిదినెలల కారాగారవాస శిక్ష విధించిరి. చెఱసాలలోనుండఁ దిరుగఁబడుటచే బోసు కొరడాదెబ్బలకు గురియై స్మృతితప్పి పడిపోయెను. చెఱసాలకు తాళ్ప్రమా ణోన్నతకుడ్యములున్నను బోసు వార్తలు ప్రజలెప్పటికప్పుడు దెలిసికొనుచు మిక్కిలి యాందోళనముపడిరి. ప్రభుత్వము బోసును విడిచివేసెను.

జనవరి ఇరువది యాఱవ తేదీని స్వాతంత్ర్యదినముగ బరిగణించి యుత్సవములును నూరేగింపులును జరిగింపవలె నని భారత జాతీయ మహాసభ వారాదేశించిరి. 1931 వ సంవత్సరమున వంగరాష్ట్రమున స్వాతంత్ర్యోత్సవమును నిషేధించుచు, ప్రభుత్వము గావించిన యాజ్ఞను బోసు

ప్రభృతు లుల్లంఘించిరి. బోసును ప్రభుత్వ రక్షకభటులు గట్టిగఁగొట్టి చెఱలో వైచిరి. కాని కొలఁదికాలములో జరిగిన గాంధి-ఇర్విన్ సమాఖ్యవలన బోసు విడుదలఁ జెందెను.

ఆంగ్లప్రభుత్వమువారు గుండ్రబల్లకూటములను నాశ గొల్పి భారతనాయకులనింగ్లాండున కాహ్వానించిరి. ఈరాయబారపు పెత్తులన్నియు వ్యర్థమనియు స్వశక్తితో సర్వస్వతంత్రప్రభుత్వమును నెలకొల్పుకొనవలెననియు బోసు వివరింపఁ దొడఁగెను. 1932 వ యేట మరల బోసును నిర్బంధించిరి. అతనికి క్షయవ్యాధియంకురించెను. వ్యాధి నివారణార్థమతనిని యూరపునకుఁ బంపిరి. పోకపూర్వము దన తలిదండ్రులను జూడ వలెనని బోసు ఆశపడెను. కాని ప్రభుత్వము నిరాకరించెను. ఆస్ట్రియారాజ్యపు ముఖ్యపట్టణమగు వియన్నా నగరములో బోసు నివసించుచుండగా భారత సామ్రాజ్యశాసన సభాధ్యక్షుఁడగు విఠల్ భాయి పటేలచటికి జేరెను. బోసు పటేలులు భారతస్వాతంత్ర్య యుద్ధమును గుఱించి విదేశములలోఁ బ్రచారముగావింపవలెనని యెంచిరి. ఇంతలో గాంధిగారు సత్యాగ్రహమును విరమించెను. ఈ వార్త బోసువిని మిక్కిలి యుగ్రుఁడై గాంధి సత్యాగ్రహము విరమించుట యనాలోచిత కార్యమనియు, నాతఁడు దేశ నాయకుఁడుగా నుండఁ జాలఁడనియు, తీవ్రవాద నాయకత్వమేర్పడవలెననియుఁ దెల్పెను. భారతీయ స్వాతంత్ర్య సంపాదనా ప్రచారార్థము విఠల్ భాయి పటేలు లక్షరూపాయిల నిధిని బోసున కొప్పగించెను. బోసు యూరపు దేశమున

సంచారముగావించెను. 'భారత సంగ్రామ' మను గ్రంథము నింగ్లాండులోఁ బ్రకటించెను. ఇటలీ, ఫ్రాన్సు, బాల్కను రాజ్యములు మున్నగు దేశములలోఁ దిరిగి భారతీయుల వాంఛ నాదరింపుఁడని హెచ్చరించెను. మరణశయ్య యందున్న తండ్రిని జూచుటకు బోసు మాతృదేశమునకుఁ దిరిగి వచ్చెను. జానకీనాథబోసు కడచూపు సుభాసునకు దొరకలేదు. బోసును ప్రభుత్వమువా రెన్నియో నిబంధన లలోఁ బెట్టిరి. అతని యారోగ్యము మరల చెడినందున నతఁడు వియన్నాకుఁ బోయెను. కొంత స్వస్థతఁబొంది బోసు ఫ్రాన్సు, ఐర్లండులకుఁ బోయి భారతదేశమునకు సహాయ సానుభూతి వాగ్దానములను నగ్రరాజ కార్యధురంధరులనుండి పొందెను. మాతృదేశమునకు వచ్చి వెంటనే బంధితు డయ్యెను. మరల నారోగ్యము చెడుటచే స్వస్థతకొఱకు యూరపున కేగి 1938 వ యేటఁ దిరిగివచ్చెను. అనారో గ్యము గుదిబండవలెఁ దగుల్కొన్నను బోసు తలంపు లెప్పు డును దేశసేవయందే లగ్నమైయుండెను.

భారతజాతీయ మహా సభాధ్యక్షుఁడుగా సుభాసు బాబు ప్రజలచే నెన్నుకొనఁబడెను. అది యేబదియొకటవ సాంవత్సరిక మహాసభ. హరిపురమున జరిగినది. బ్రహ్మాం డోత్సాహముతో దేశము సుభాసు నాహ్వానించి గౌరవిం చెను. మహారథముపై నూతనాధ్యక్షు నాసీనుంజేసి పట్టరాని యానందముతో లక్షల కొలఁదిగఁగూడిన ప్రజలాతని నూరే గించిరి. మఱుచటి సంవత్సరమునఁగూడ సుభాసే అధ్యక్షు

డుగా నుండఁదలంచెను. గాంధిగారి కిది ఇష్టము గాకున్నను బోసే పలురాష్ట్రములచే నెన్నుకొనఁ బడెను. కాని గాంధితత్వవాదులకును బోసు పక్షీయులకును విభేదములు హెచ్చాయెను. గాంధి పక్షము నియమసమ్మతమై యుండుటచేతను, సుభాసు కాంగ్రెసుక్రమశిక్షను మీఱి ఖండనోపన్యాసములు గావించుటచేతను నతనిని మూఁడేండ్లు వఱకును కాంగ్రెసునుండి తొలఁగింపవలసి వచ్చెను. సుభాసు దేశభక్తి యమోఘమైనను నాతని కార్యపద్ధతి క్షేమకరము గాదని మహాత్ముఁడు ప్రేమతోనే సుభాసును దొలఁగించెను. కాని బోసు కలకత్తాలో విప్లవోపన్యాసములు గావించుచునే యుండెను. హాల్ వెల్ దొర విగ్రహమును బహిరంగస్థలము నుండి దీసివేయించుటకు సత్యాగ్రహమును నడిపెను. ప్రభుత్వము బోసును బంధించెను.

1940 వ సంవత్సరమున నవంబరు మాసాంతమున బోసు నిరాహారదీక్షకు దొరకొనెను. ఈ నిరశన వ్రతదీక్షా వార్త దేశమందంతటను వ్యాపించిపోయెను. ప్రజలెల్లరును కలవరపడిరి. బోసునకుఁ బ్రాణాపాయస్థితియేర్పడెను. అతనికిఁ బ్రాణభంగము గలిగినచో దేశమునందెట్టి విషమదశ యేర్పడెడిదో! ప్రభుత్వము బోసును విడిచిపెట్టి, యాతని స్వేచ్ఛాసంచారమును మాత్ర మరికట్టి యతని చర్యలను గూఢముగఁ బరిశీలించుచుండెను.

బోసు హృదయమునఁ జెలరేగుచుండిన గాలివాన యెవరికెరుక? వివిధభావము లతనిమనఃఫలకమునఁ జిత్రింపఁ

బడుచుండెను. దేశదాస్య విమోచనకుఁ దగు మార్గము గోచుటలేదు. గాంధి శాంతమార్గమీతనిఢాక కాగదు. ఇంట నొకగదియందుండి మిత్రులకుగాని బంధువులకుఁగాని కంటఁ బడక యీతడు నలువదిదినము లేకదీక్షతోనుండెను. గడ్డము పెరిగి యీతడు రూపాంతరము చెందినట్లుండెను. ఇంటనుండి యేమిపన్నుగడలు పన్నెనోగాని యొకనాటిరాత్రి యీత డదృశ్యుడయ్యెను. వేయికండ్లతోఁ గాచుచున్న ప్రభుత్వ మును గనుఁబ్రామి మాయమగుటలో బోసు సాహస మబ్బురము.

## దేశాంతరవాసము

భారతమాత దాస్యశృంఖలములఁ గృశించుచుఁ బరిభవక్లేశవివశయై కన్నీరుగార్చుచుఁ దనవంకదీనముగఁ దిల కించుచున్నట్లతడు భావించెను. మాతృదేశ విమోచనమే యీతని పరమలక్ష్యమాయెను. తల్లక్ష్యసిద్ధి కవకాశములు భారతభూమియందుఁ దనకలభ్యమాయెను. మహాత్ముడు దన యహింసామార్గమున దేశములోపలనుండి ప్రభుత్వమును గలగుండు పెట్టవచ్చును. తాను దేశాంతరములనుండి సహాయ సంపత్తునార్జించి ప్రభుత్వమును నిర్జించవచ్చునని బోసు తలం చెను. దీర్ఘసూత్రుడై వ్యర్థాలోచనములోఁ గాలముగడుపుట కంటె నెట్లో దేశమునుండి బయటఁబడిన నేపూర్వ మిత్రరా జ్యమో దన కాశ్రయమీయకుండునాయని యీతని దృఢ విశ్వాసము. భారతదేశము స్వశక్తినే నమ్మి స్వాతంత్ర్యము సంపాదింపవలెనుగాని విదేశములతోడ్పాటును యాచింపరా

దనియు, విదేశములుతోడ్పడెదమన్నను నందుకొనకూడదనియు గాంధి మతము. కాని బోసు ఆత్మగౌరవమునకును దేశక్షేమమునకును భంగములేని పద్ధతిని బరదేశసహాయము నభ్యర్థించి యెట్లయిన బ్రస్తుతావస్థనుండి దప్పించుకొని స్వతంత్రభారతమును గన్నులారఁ జూడవలెనని యాశపడెను.

బోసు తనరాజనీతికి దగిన వేషములు వేసెను. ఎత్తులుమార్చెను. గడ్డము పెంచి దుస్తులుమార్చుటచే మహమ్మదీయ పండితునివలె నుండెను. 1941 సంవత్సరము జనవరి పదునైదవ తేదీరాత్రి కలకత్తాసమీపమున రైలెక్కి పెషావరుచేరుకొనెను. అచ్చట పఠానుల వేషముధరించెను. బోసునకుఁ దోడునీడగా భగవత్ రాముఁడను మిత్రుఁడుండెను. బోసు జియఉద్దీన్ నామము ధరించెను. భగవత్ రాముఁడు రహమత్ ఖానని పేరుపెట్టుకొనెను. ఇద్దఱును బాదచారులై కాబూలుత్రోవను బడిరి. పేరులు క్రొత్త. వేషములు క్రొత్త, కఠిన శిలామార్గము క్రొత్త. స్వాతంత్ర్య భావన యొకటియే ప్రాత. అనుక్షణమును బోసుచర్య లరయుచుండిన ఆంగ్లరాజ్య గూఢచారులు బోసు పలాయనవార్తను బ్రభుత్వమునకుఁ దెల్పిరి. ప్రపంచమున నత్యంత బలిష్ఠరాజ్యమగు బ్రిటిషుసామ్రాజ్యమేమి చేయలేదు! తంతివార్తలన్ని మూలలఁ బర్వులిడెను. బోసునుబట్ట సాయుధభటులును గూఢచారులును నియుక్తులైరి. జియాఉద్దీన్ రహమతులు కాళ్ళు బొబ్బలెక్క నడచుచుండిరి.

జియాఉద్దీ నొకచోట మాటలాడుచు నొకచోట మూఁగ వానివలె నటించుచు వెంటఁబడిన 'తుపాకీభటుల' చేతులలోఁ బడకుండఁ దప్పించుకొనుచు సాగిపోవు చుండెను. కాళ్ళనుండి రక్తము గాఱుచున్నను శత్రు హస్తగతులు గాకుండ వారు కాబూలునగరము చేరుకొనిరి.

కాబూలు రాజధానీనగరముగాఁగల ఆఫ్గనిస్థానము బ్రిటిషు ప్రభుత్వమునకు మిత్రదేశమే. అందుచే బోసు జాడలు దెలిసినంతనే యతని బట్టి ఇచ్చుటకు గూఢచారులు నేటకుక్కలవలెఁ దిరుగుచుండిరి. జియాఉద్దీన్ రహమతు లొక సత్రములో బసచేసిరి. కాబూలులో ఉత్తమచందను నొకత్యాగమూర్తియు వ్యవహారదక్షుఁడునగు మహాశయుఁ డుండెను. బోసతనిని గుఱించి మున్నె వినియుండెను. బోసు ప్రఖ్యాతి యుత్తమచందునకు దెలియును. ఉత్తమచందు బోసు భగవత్ రాములను దనయింట దాఁచెను. వారికొక గదిలో నాహారాదు లేర్పఱచి వారు పరునికంటఁబడనక్కర లేకుండఁ జూచెను. బోసు రష్యాదేశము చేరుకొన్నచో నచ్చటి ప్రజాప్రభుత్వము దన యాశయముల నుదార బుద్ధితోఁ జూచునేమోయని తలఁచి రష్యాకుఁబోవు నాలోచనలు చేసెను. జర్మనీ ఇటలీలతో శత్రుత్వము వహించి బ్రిటిషు రాజ్యపక్షమునఁ బోర సంగ్రామమునకు దిగియున్న రష్యా బోసున కాశ్రయమీయఁదలంపలేదు. ఇటలీ, జర్మనీ దేశముల రాజ్యపద్ధతులు దన మనస్తత్వమునకు నచ్చకున్నను నా దేశములు బ్రిటిషు రాజ్యమునకు శత్రుపక్షములోనివి గాన,

బ్రిటిషురాజ్యముపై గత్తికట్టి బయటఁబడిన బోసు దన్నా రాజ్యము లాదరింపవచ్చునని యెంచి యుత్తమచందు సాయమున కాబూలులోని ఇటలీ, జర్మనీ రాయబారులతో సంప్రదించెను. కాబూలు వాసము దినదిన గండముగ నుండెను. ఇటలీ జర్మనీలనుండి తన కాహ్వాన వార్తలు వచ్చువఱకును బోసు అజ్ఞాతవాసము గడపవలెను. ఇంచు కంతయైన నాతనిగుట్టు బయటఁబడిన నాతని యూహా సౌధము గూలిపోవుటయేగాక భారతదేశస్థితియు మఱింత శోచనీయమగును.

ఉత్తమచందునింట గుప్తముగాఁ జాలదినములుండుట యసాధ్యము. దాగియుండఁజాలక బోసు మరల సత్రము జేరుకొనెను. గూఢచారులతని జాడలఁదీయుటకు వెన్నంటి తిరుగుచుండిరి. లంచములిచ్చి వారి బాధ దీర్చుకొనుచుండెను. ఇట్లుండ బోసునకు రక్తగ్రహణి బాధపట్టుకొని అతఁడు చాల బాధపడెను. ఔషధచికిత్స చేయింతమన్న నజ్ఞాతజీవితము బట్టబయలగును. అందుచే మరల నుత్తమచందు నిల్లుచేరి విశ్రాంత్యుపచారములను బొంది బోసు స్వస్థుఁడాయెను. ఇంతలో జర్మనీకిపోవుట కనుమతిపత్ర మరుదెంచెను. అవి యుద్ధదినములుగనుక నొకదేశమునుండి మఱొక దేశమున కేగుట కెన్నియో నియమములు పాటింపవలెను. బోసు ఛాయాచిత్రములు ముందుగఁ బంపఁబడెను. విదేశీయ దూత లేతెంచి బోసును గొనిపోయిరి. అతఁడు బెర్లినుచేరుకొనెను. జర్మను నియంత హిట్లరు బోసునకు స్వాగతమిడి యాతనికిఁ

గావలసిన సౌకర్యములఁ గల్పించెను. హిట్లరునంతటివాడి మెప్పును బడసిన బోసు కార్యదక్షత నేమననగును!

అది 1942 వ సంవత్సరము. యుద్ధజ్వాలలునలుగడల నలముకొనుచుండెను. జర్మనీ ఇటలీ జపాను దేశములు ప్రపంచమును గబళించివేయునట్లుండెను. భారతీయులు దమయంగీకారముతో నిమిత్తము లేకుండగనే బ్రిటిషు రాజ్య పక్షమున యుద్ధమున కీడ్వఁబడిరి. మహాత్మునికి యుద్ధమన్న నిష్టములేదు. దేశనాయకు లకారణముగ బ్రిటను శత్రుప్రులతోఁ బోరాడ నిచ్ఛగింపక యుద్ధాశయములేవోఁ దెల్పినగాని, భారతదేశ స్వాతంత్ర్య ప్రదాన ప్రమాణము చేసినఁగాని, దాము యుద్ధమునఁ దోడ్పడరాదనుకొనిరి. మహాత్ముఁడు 'క్విట్టిండియా' యనగా 'ఇండియాను వదలిపొండు' అను మంత్రమును బఠించెను. సత్యాగ్రహ మారంభింతుమని గాంధి తన యుద్దేశమును ముందుగఁ బ్రభుత్వమునకుఁ దెల్పెను. గాంధికేక నాలుగుమూలలఁ బ్రతిధ్వనింపకముందే యతని ననుచర సహితముగఁ గారాగారమునఁ ద్రోసిరి. మహానాయకులందఱును జెఱఁబెట్టఁబడిరి. నాయకరహితులగు ప్రజలిష్టమువచ్చినట్లు దౌర్జన్యచర్యలకుఁ గడంగిరి. ప్రభుత్వము తుపాకులుపేల్చి పెక్కండ్ర ప్రాణములుదీసెను.

బోసు బెర్లినునగరములో నొక రేడియో కేంద్రమును నెలకొల్పుకొనెను. తాత్కాలిక స్వతంత్రభారత ప్రభుత్వమును జర్మనీలో స్థాపించితినని చెప్పి యుద్ధప్రచార

మారంభించెను. భారతీయ వీరయుద్ధమును బాగుగ నుపయో గించుకొని దాస్యశృంఖలములఁ ద్రెంచి వేయుటకు భీషణకృషి యొనరింపవలెననియు, మహాత్ముని ద్రోసిపుచ్చి, పేరు ప్రతి ష్టలను గడించుటకుఁగాక భారత స్వాతంత్ర్య ఫలమునంది మహాత్ముని పాదములకడ సమర్పింపఁదాను విదేశములఁ బట్టితి ననియు బోసు పలుమారులు భారతీయుల కుద్బోధించెను. మహాత్ముని కిట్లు విన్నవించుకొనెను: 'మహాత్మాజీ! బయటి నుండి యుద్ధసహాయము లేక భారతదేశము స్వాతంత్ర్య మును సాధించుకొనఁ గలదని నా కీషన్మాత్రమైన యాశ యుండిన నెన్నఁడును నిట్టి యాపత్సమయమున మాతృ భూమిని వీడి యుండెడివాఁడనుగాను". భారతీయులవాంఛను దీర్పఁడని బోసు అమెరికాకుఁ జెప్పెను. అతనిమాటలు వినఁగూడదని ప్రభుత్వము నిషేధించుచున్నను భారతీయులు రహస్యముగ నాకాశవాణివలన వినుచునే యుండిరి.

ప్రాచ్యరంగమున జపాను నిరర్గళాక్రమణమునకు విజృం భించి భారతదేశముపైఁ బడనున్నదని బోసు వినెను. ఒక జలాంతర్గామిలో నెక్కి జపానునకుబయలు దేరెను. ఆకాశము నుండియగ్నివర్షమును, నీటిలో శత్రుజలాంతర్గాములను దప్పిం చుకొని బోసు జపాను ప్రధాననగరమగు టోకియో చేరెను. జపాను చక్రవర్తియు నమాత్యులును బోసున కుచితరీతిని స్వాగతమిడిరి. జపానులో స్వతంత్రభారత సైన్యము నిర్మింపఁ బడెను. బోసు జపానురాజ్యముతో సంధిగావించుకొని తీవ్ర యుద్ధయత్నములకుఁ గడంగెను. ఎట్టి స్థితియందైనను జపాను

సేనలు బ్రిటిషు రాజ్యమును గూలఁద్రోయుటకుమాత్రమే స్వతంత్రభారత సేనలతోఁగలిసి పోరాడవలెనుగాని, భారత భూమియందు వారడుగిడరాదని యతఁడుచేసిననియమమును పాలించుటకు జపానువా రంగీకరించిరి. ఈ నియమమును వ్యతిరేకించినచో జపానుతోనైన యుద్ధమాడ వెనుదీయనని బోసెచ్చరించెను.

బోసునందలి యుద్ధతంత్ర నిర్మాణకౌశలము వర్ణనాతీతము. ఏయుద్ధకళాశాలలోను నాఁటి తెలుసుకున్నను శత్రువులకు వెఱగును వెఱపునుగలుగునట్లతిశీఘ్రముగాను చాకచక్యముతోను వ్యూహనిర్మాణములను గావించెను. మలయా ద్వీపకల్పమునందునుసింగపూరుప్రాంతమునందును యుద్ధయాత్రలు గావించి స్వతంత్రభారత ప్రభుత్వమును నెలకొల్పెను. స్థిర ప్రభుత్వములకెట్లు మంత్రులును, దండనాయకులును, గార్యనిర్వాహకోద్యోగులును నుందురో యట్లే దన ప్రభుత్వమునకును నుద్యోగుల నియమించెను. యుద్ధమునకుఁ బ్రత్యేకముగ దిగఁబోవుచు మహాత్మునకిట్లు మనవి చేసెను: "భారతజాతి పితా! దేశవిముక్తికిఁ గావించు నీ పవిత్ర యుద్ధ విషయమై మీ యాశీస్సులను శుభాకాంక్షలను నభ్యర్థించుచున్నాము."

తాత్కాలిక స్వతంత్ర భారత ప్రభుత్వమును నెలకొల్పుచు బోసుగావించిన మహాప్రకటనమిది:—

బ్రిటిషు ప్రభుత్వము కూట నీతి వలనను, కపటము వలనను భారతదేశమునుదోచి కొల్లగొట్టి, ప్రజలను క్షామ

మరణములపాలుచేసి దుర్భరస్థితినిగల్పించి ప్రజాసానుభూతిని బూర్తిగఁ గోల్పోయి, యిప్పుడవసానదశలో దినములు లెక్క పెట్టుకొనుచున్నది. ఈ యెండుచెట్టును గాల్చివేసి భారత స్వాతంత్ర్యమార్గమును వెలిగించుటకగ్నిజ్వాలనంటించుటయే యవశిష్టము. ఈ యవశిష్టకార్యమే భారతస్వాతంత్ర్య సైన్యము సాధింపవలసిన కార్యము.

స్వాతంత్ర్యారుణోదయ రేఖలు గానవచ్చుచున్నవి గాన, భారత ప్రజలు స్వకీయప్రభుత్వమును స్థాపించుకొని, యా ప్రభుత్వ ధ్వజము క్రింద నంతిమస్వాతంత్ర్యసమరము గావింపవలెను. భారతదేశనాయకులందఱును చెఱసాలలలో మ్రగ్గుచుండ, భారతీయులెల్లరును నస్త్రసన్యాసులు గావింపబడియుండ భారత భూమియందు స్వతంత్ర ప్రభుత్వమును స్థాపించుటకుఁగాని యుద్ధములేవనెత్తుటకుఁ గాని శక్యము కాలేదు. కావున ప్రాచ్యాసియాయందలి హైందవదేశభక్తులచే నెలకొల్పఁబడి, భారతదేశాభిమానులచే నాదరింపఁబడి యావద్భారత ప్రజానీకముచే నాశీర్వదింపఁబడి వెలయుచున్న యీ భారతస్వాతంత్ర్య సమితివారికి స్వాతంత్ర్య యుద్ధము పరమధర్మమైనది.

ప్రాచ్యాసియాయందు భారతస్వాతంత్ర్యసమితివారి తోడ్పాటునఁ దాత్కాలికస్వతంత్ర భారత ప్రభుత్వముగా నేర్పడిన మేము మా శిరస్సులపైఁ బడిన కార్యభారమును బూర్తిగ నెఱిఁగియే వహించుచున్నాము. బ్రిటిషు ప్రభుత్వ

మును వారి మిత్రులును గూలంద్రోయఁబడి స్థిరమైన స్వతంత్రభారత ప్రభుత్వము భారతావనియం దుద్భవిల్లు నఱకును మేము ప్రజావిశ్వాసమునకుఁ బాత్రులమై, ప్రజల ధర్మకర్తలమై వ్యవహరించుచుందుము.

ప్రతి భారతీయుఁడును నీప్రభుత్వమునకు భక్తి విశ్వాసములు చెల్పుకొనవలెనని విధించుటకు మాకధికారము గల దని యీ ప్రకటన మూలమున విశదపఱచుచున్నాము. దేశ ప్రజలందఱి మత స్వాతంత్ర్యమును, సమాన హక్కులను, సమానావకాశములను గాపాడుదుమని వాగ్దానము చేయుచున్నాము. ఇంతవఱకును బరప్రభుత్వముచేఁ గుత్సితముగఁ బైకెత్తఁబడిన యంతఃకలహములను భేదభావములను నిర్మూలించి భారతజాతిని, దానిసర్వాంగములను సౌఖ్యసౌభాగ్యములతోఁ బెంపొందించుటకీ ప్రభుత్వము దన దృఢసంకల్పమును బ్రకటించుచున్నది.

సర్వశక్తుఁడగు దేవునినామమునను, భారత ప్రజల నొక జాతిగా సన్నిహితపఱచిన తరతరముల పెద్దల నామమునను, తమ సంతతివారమగు మనకు త్యాగపౌరుష సంప్రదాయములను బ్రసాదించి దేశముకొఱకుఁ బ్రాణముల నర్పించిన వీరుల నామమునను, భారత ప్రజలెల్లరును నీ స్వతంత్రధ్వజమునండను గూడుకొని స్వాతంత్ర్యముకొఱకుఁ దుదిదెబ్బ తీయవలెనని యుద్ఘోషించుచున్నాము.

(సంతకము) సుబాస్ చంద్రబోసు.

రాజ్యాధిపతి, ప్రధానమంత్రి, యుద్ధ విదేశవ్యవహారమంత్రి.

బర్మా, మలయా, సింగపూరు, ఇండోనేషియా, హాంకాంగు మున్నగు ప్రదేశములలో వివిధ వృత్తులలో జీవయాత్రను గడుపుచున్న భారతీయుల నందఱను నేక కార్యోన్ముఖులఁ గావించి, స్వాతంత్ర్యోన్మాదము పుట్టించి బోసు ఉక్కుతునుకలవంటి యోధులుగల స్వతంత్రభారత సైన్యమును నిర్మించెను. స్వతంత్రభారత ప్రభుత్వమునకుఁ దాను నాయకుఁడై నేతాజీయని ప్రేమపూర్వకముగఁ బిలువఁబడుచుండెను. తన ప్రభుత్వమునకు తపాలా యేర్పాటులనుగూడ నెలకొల్పెను. భారతీయు లందఱును త్రివర్ణపతాకముక్రిందఁ గూడి బోసునుదోధనలనుబట్టి ధనమును వేలుగను లక్షలుగను గుమ్మరించిరి. రంగూనులో బోసునకు గౌరవార్థము వేసిన పూలమాలను వేలమువేయగాఁ బండ్రెండు లక్షల రూపాయలు లభించెనఁట. బోసు బంగారముతోఁ దులాభారముతూగి యాధనమునంతను స్వతంత్రభారత ప్రభుత్వమునకిచ్చివేసెను. తానా బ్రహ్మచారి, ఉపాస్యదేవతయా భారత స్వాతంత్ర్యలక్ష్మి. బో సిచ్చి వేయరాని దెద్దియుండును! ఎనిమిదిన్నర కోట్ల రూప్యములను బ్రోగుచేసి స్వతంత్రభారత 'బ్యాంకు'ను గూడ నెలకొల్పెను. జపాను నుండి యాయుధసామగ్రిని దెప్పించెను. ఇట్లు దన ప్రభుత్వమును సర్వాంగ పరిపుష్టము గావించుకొనెను. స్వతంత్రభారత ప్రభుత్వపు రాజభాష హిందుస్తానీ. లిపి రోమనులిపి. వారి వందనము 'జైహింద్'. వారియుద్ధాశయము ఢిల్లీ చలో.

'జై హింద్' పదము భారతదేశమునందును వ్యాపించి యభి వందనపదముగా నిల్చినది.

బోసు సైన్యములో బ్రాహ్మణులు, అబ్రాహ్మణులు, హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, సిక్కులును నెల్లరు నేకాశయులై సంకుచిత భేదభావములను మఱచి అన్నదమ్ములవలె బుజమును బుజమును గలిపి త్యాగాగ్నిలో దుముకుటకు సన్నద్ధులైరి. సైనికులచే స్వాతంత్ర్య ప్రమాణములను జేయించి బోసు వారిని స్వరక్తముతో సంతకములు చేయునట్లేర్పఱచెను. స్వరక్తముతో సంతకములుచేయ నహమహమికతో వీరులు ముందున కుఱికిరి. ఉద్రేకము పొంగి పొఱలుచుండెను. బోసు స్త్రీలపటాలమునుగూడ నేర్పఱచెను. దానికి ఝూన్సీ లక్ష్మి దళమని పేరుపెట్టెను. 'లక్ష్మిస్వామినాధను' అను దాక్షిణాత్యకన్య దానికి నాయకురాలు. సిపాయిల తిరుగుబాటని యాంగ్ల ప్రభుత్వమువారుదప్పుగాఁబేరిడిన ప్రథమస్వాతంత్ర్యసంగ్రామమందలి వీరశిఖామణులగు బహదూర్‌షా నానాసాహెబు, తాంతియాతోపి, ఝూన్సీలక్ష్మి దేవులను గుఱించి బోసు ఉద్రేకభావములతో నుపన్యసించినపుడాతని సైనికులు నిర్భరావేశ వివశులై యఱచిరి. బోసు అండమాన్ నికోబారు దీవులను వశపఱచుకొని వానికి రాజాయెను. ఈతని ప్రభుత్వము నంగీకరించి జర్మనీ, జపాను, ఇటలీ, థాయిలాండు, ఫిలిప్పైన్సు, మంచూరియా, బర్మా ప్రభుత్వములు రాయబారులనంపి రాజకీయపు టొడంబడికలు గావించుకొనినది.

బోసు విసుగును విరామమును లేకుండ యుద్ధ కార్య పర్యవేక్షణములో నిమగ్నుఁడై యుండియుఁ దన సన్నాహములను నెత్తులను రేడియో మూలమున భారతదేశమున కెఱుక పఱచుచుఁ దాను దన స్వతంత్రసైన్యముతో భారతభూమి యందడుగిడఁగానే భారతీయులందఱును నిర్భీకులై పరప్రభుత్వమును బటాపంచలుగావించి స్వాతంత్ర్యమును బ్రకటించుకొనవలెననియు నట్టి యవకాశము యుద్ధము త్వరలోఁ బ్రసాదించుననియుఁ దెల్పెను. మహాత్మగాంధి పట్లను, జవహరులాలు, పటేలులపట్లను దన భక్తిగౌరవములను బ్రదర్శించెను.

బోసు నాయకత్వమున స్వతంత్రభారత సైన్యము పురోగమించి ఇన్ఫాలుకోటను ముట్టడించి అస్సాము రాష్ట్రములోఁ జొరఁబడి కోహిమా ప్రాంతమువఱకుఁగల దేశభాగమును స్వాధీనము చేసికొనెను. జపానువారే నిమిషమున కేమొత్తుమెత్తి భారతదేశాక్రమణమునకుఁ దారకొందురోయని బోసు కట్టుదిట్టముగఁ జూచుకొనుచుండెను. 1945 వ సంవత్సరములో యుద్ధపు వెల్లువ వెనుకకు బడెను. జపాను జర్మనీల బలముడిగెను. అమెరికావారు ప్రయోగించిన అణుశక్తి బాంబులతో జపానునగరములు నేలమట్టమై లక్షలాదిగఁ బ్రజలు కీటకములవలె నశించిరి. జపానువారోటమి నొప్పుకొని బర్మానుండి తమ సేనల నుపసంహరించుకొనిరి. అండ కూలిపోగా బోసు విఱుగవలసివచ్చెను. బర్మాకు మరలి యచ్చటినుండి సయామునకుఁ దగ్గవలసివచ్చెను. తన స్వతంత్రభారత ప్రభుత్వమును బ్యాంకాకుకు మారు

కొన్నాఁడు. ఇట్టి యుత్కట విషమావస్థయందు నేదో యొక విదేశమునఁ దలదాఁచుకొని యనుకూల పరిస్థితు లొదవినప్పుడు మరల దలయెత్తవచ్చునని బోసు రష్యాతో సంప్రదింపులు జరుపుకొని రష్యాకేగ విమానము నధిరోహించెను. ప్రాణము లరచేతఁబెట్టుకొనియు నాశాజ్యోతి మనో వీధిని వెలిగింప నాతడు బయలుదేరెను.

బోసు విదేశములలోఁ దలదాచుకొని యవసరానుసరణిని మరలఁ దలయెత్తి శత్రునాశము గావింపవచ్చునని యెంచి యధిరోహించినవిమానమే యీతనికి స్వర్గరథమాయెను. విధిలీల లనూహ్యములు; అనుల్లంఘనీయములు. భూగర్భమునను జలగర్భమునను వాయుగర్భమునసుగూడ నగ్నికణము లెగురుచున్న యుద్ధదినములవి. ప్రపంచగోళమంతయు మండుకొట్టువలెనుండెను. పాపము! బోసు ఏదుష్టముహూర్తమున గాలియోడ నెక్కెనోగాని యది నిప్పంటుకొనెను. అంటుకొనఁగానే విమానసారథి దానిని భూమికి దించెను. కాని బోసుదేహమంతయుఁ గాలిపోవుటచే నాతని బ్రతికింప శక్యముగాకపోయెను.

అహర్నిశములు భారతస్వాతంత్ర్యమునే యుపాసించుచుఁ బ్రలపించుచుఁ గలలుగనుచు, దేశగౌరవక్షేమముల కిసుమంతయు భంగము వాటిల్లని పద్ధతిని విదేశరాజ్యములతో సంధులుచేసికొని, మంత్రియై, సేనాధిపతియై, రాజ్యాధినేతయై యేయాధునిక భారతీయ వీరుఁడును బొందని మహారాజ

గౌరవమును బొందిన సుభాసుచంద్రుడిట్లు స్తమించెనని విన్న పుడు భారతీయులువలవలనేడ్చిరి. తప్పిపోయినపుత్రునికొఱకు విలపించినట్లు గాంధి విలపించెను. దేశమందంతటను బోసు విగ్రహములు వెలసెను. బోసు భక్తులు దేశమున వేలకొలంది గనున్నారు. వారు బోసు నిజముగ మరణింపలేదనియుఁ గారణాంతరములచే నేవిదేశముననో ప్రచ్ఛన్నముగ నుండి యుండవచ్చుననియుఁ దగిన యదనున మాతృదేశమున కరుదెంచుననియు నమ్మిరి.

# పరార్థజీవి డామియన్ పాదిరి

ఈ విశాలప్రపంచమున భగవల్లీలలు చిత్రవిచిత్రముగ గోచరించుచుండును. సామాన్యదృష్టికి విశేషమేమియుఁ గనఁబడకున్నను నిర్మలదృష్టితోఁ జూచువారికి శాద్వలస్థలులందును, జలప్రవాహములందును, దుర్గమారణ్యములందును దైవశక్తులు వ్యక్తమగుచుండును. సృష్టికర్తను గనఁజాలకయు, ప్రకృతిరహస్యముల తత్త్వము దుదముట్టఁజూడఁజాలకయు, ధీశాలులుసృష్టికార్యములనుజూచిభ్రమసిపోయి, వాని మూలమునఁ బరాత్పరుని యనంతశక్తుల ననుమేయింతురు. పరాత్పరుఁడు జీవకళ్యాణముకొఱకే సృష్టియందు వైవిధ్యము నేర్పఱచినాఁడు. సృష్టియంతయు నొకేరీతినుండిన విసుగు జనించునుగదా! వేయిమంది బిడ్డలలోఁ దల్లి దనబిడ్డను బోల్చుకొనఁ గలుగుచున్నది. మందలో నావు దనదూడపు

నెఱుంగుచున్నది. రూపములందు వైవిధ్యమున్నట్టులే గుణభేదములును ననంతములు. ఒకఁడు సుఖభోగి, యొక డలసుఁడు. ఒకఁడు స్వార్థపరుఁడు, వేఱొకఁడు పరార్థజీవి. ఒకడు శాంతచిత్తుడు, ఒక డావేశపూరితుడు. ఇట్లు భిన్నస్వభావులగు వ్యక్తులచే లోకనాటకము చిత్రముగ నడచుచున్నది.

మన మొక విచిత్రస్వభావుని గుఱించి చదువుదము. భగవద్భక్తిచేతనో, సేవాబుద్ధిచేతనో, పరులక్షేమముకొఱకు దమ జీవితములను జెప్పరాని యిక్కట్టుల పాలుగావించుకొనిన ధీరులక్కడక్కడ నుందురు. అట్టివారిలో డామియన్ పాదిరీ యొకఁడు. ఈతని మొదటిపేరు జోసెఫ్. ఇతఁడు 1840 సంవత్సరము జనవరి 3 వ తేదీని బెల్జియము దేశములో నొక చిన్నపల్లెయందు జన్మించెను. ఈతనికొక సోదరియు నిద్దరు సోదరులును గలరు. గొఱ్ఱెలతోఁ దిరుగుటయు నేదియో ధ్యానించుచు నేకాంత సంచారము చేయుటయు నీతని బాల్యాభ్యాసములు. గొఱ్ఱెపిల్లలతో సతతము దిరుగు నీతని స్వభావమును జూచి చుట్టుపట్టుల నుండు మేషపాలకు లీతనికి 'చిన్న గొఱ్ఱెలకాపరి' యని పరిహాస నామమిడిరి. నాలుగేండ్ల ప్రాయమున నొకనాఁడు తల్లిదండ్రులీతనిగానక పలుతావులందు జనసమూహములలో వెదకిరి. కాని బాలుఁడెందును గానరాలేదు. చీకటిపడిన తరువాత నిర్మానుష్యమైన యొక దేవాలయమునఁ బ్రార్థనావేదికదగ్గఱ మోకరించియున్న బాలుఁడు దల్లిదండ్రులకు దొరికెను. అపార సృష్టివైచిత్ర్యములను దిలకించి యీతఁడు భగవన్మహిమాతి

శయము నూహించి బాల్యమునుండియే ప్రార్థనాపరుఁడై యుండెడివాఁడు.

'పుత్రాదిచ్ఛేత్ పరాజయ' మ్మను న్యాయమునుబట్టి తల్లిదండ్రులు దమబిడ్డలు దమకంటె గొప్పవారు కావలెనని యాశపడుటయు, వారి యభ్యున్నతికిఁ దమ ప్రాణముల నర్పించుటయు లోకసహజమే. కాని ఎల్లరు తలిదండ్రులును దమ పుత్త్రుల యభిరుచులను బాగుగ గుర్తింపజాలక దమ శక్త్యభిరుచులనుబట్టి బాలుర నాయావిద్యాలయందుఁ బ్రవేశ పెట్టఁ జూచుదురు. ఇట్లే జోసెఫు తలిదండ్రులును నతనిని వ్యాపార విద్యకొఱకుఁ బ్రత్యేకించియుంచి యతని యన్నలకు మతవిద్య చెప్పించిరి. వ్యాపారవిద్యా ప్రవీణులుగావలసినవా రాకాలమున ఫరాసు భాష నభ్యసింపవలెను. జోసెఫు ఫరాసుభాషాభ్యాసము కొఱకొక పాఠశాలలోఁ జేరెను. కాని యతని మనః ప్రవృత్తికిని వ్యాపారవిద్యకును బొత్తు కుదర నట్లు స్పష్టమాయెను. భగవద్భక్తుఁడై మానవసేవలోఁ దన జీవితమును గడుపవలెనను నభినివేశ మాతని హృదయమున నానాఁటికి బలపడఁదొడఁగెను. విద్యాభ్యాసకాలమున నవ కాశము చిక్కినప్పుడెల్ల నాతఁడొక మతప్రచారక సభవారి కూటములందుఁ బాల్గొనెడివాఁడు. శేముషీ వరిష్ఠులగు వక్తలు దమ శ్రోతల నెంతదూరమైనఁ గొనిపోఁగలుగుట మనము చూచుచున్నాము. మతోపన్యాసములచే దూరా కృష్టుఁడై జోసెఫు మత విద్యాభిలాష దనకు దివ్యప్రేరణచేఁ గల్గెననియు, వంధుల కనుగుణముగఁ దాను బ్రవర్తించుట

కనుమతి వేఁడుచుంటి ననియుఁ దలిదండ్రులకు వ్రాసెను. సౌఖ్య సంపాదనకుఁ బ్రధాన సాధనమగు ధనమును గొల్లలుగ నార్జించుటలో వ్యాపారము వంటిది మఱొకటిలేదని నమ్మి దమ యభిరుచినిబట్టి మొదటఁ బుత్త్రుని వారింపనెంచియు దలిదండ్రులు తుదకాతని కోరిక మన్నించిరి.

జోసెఫు దృఢశరీరుఁడు, స్ఫురద్రూపుఁడు, అయిన నతఁడు రూపసౌందర్యమును సరకు గొనెడువాఁడుకాఁడు. కండరపుష్టిగల కఠినశరీరము భావికష్టసహనమున కనుకూల సాధనమని యెంచి యెల్లప్రాయమునుండియు దేహమును గష్టపెట్టు పనులయందుఁ గాకలుదేర్చుచుండెను. పారిసులోఁ గులవృద్ధులయొద్ద మతవిద్య నభ్యసించుచు వారిడు కఠిన శాసనములను బాలించుచుండెను. సుఖానుభవ లాలసునికి విద్యరాదని నమ్మి గురువులు శారీరక సుఖములను మిక్కిలి యదుపులో నుంచుచుండిరి. జోసెఫును నందులకుఁగడుంగడు ననుకూలుఁడు. మతజీవితమున కనుకూలముగ నుండుటకుఁ దన సహజసుందర ముఖమునఁ జిఱుగడ్డమును బెంచి నియమ సూచకములగు దీర్ఘకంచుకములను ధరించి యౌవన రూప విలాసములను గుదించుకొనుచుండెను. ఇతరులు మెత్తని శయ్యలందుఁ బరుండ నీతఁడొక కఠినమగు కొయ్యబల్లను దన పలుచని పరుపు క్రిందఁ బెట్టుకొని నిదురించెడువాఁడు. ఒకనాఁ డీతనితల్లి పరుపు క్రింది కొయ్యబల్లను జూచి, పుత్త్రుని గట్టిగమందలించెను. మాతృగౌరవముచేఁ గొన్నినాళ్ళతఁడా యభ్యాసమును వీడ వలసి వచ్చెను.

జంతువులయెడను యోసేఫునకపారప్రేమ గలదు. ఈతని పొరుగింటి ముసలియామెకొక యావుండెను. ఆగోవునకొక తీరనివ్యాధి సంభవించెనని దానిని గటికవాని ఖడ్గమున కొప్పగింప నిశ్చయించిరి. ఆ దీనజంతువు కరుణావిలాపము నాలకించియో యన్నట్లు యోసేపక్కడ నిలిచి కటికవానిని బంపివేయఁ గఠినముగ గద్దించి తాను స్వయముగ గోసేవకుఁ బూనుకొనెను. తాను గోశాలయందెల్లవేళలఁ గాచుచు గోవునకు సమస్తోపచారములుచేసి, తన ప్రార్థనాబలము చేతనా యన్నట్లు దానిని స్వస్థపఱుపఁ గలిగెను. ఇట్లు జీవకారుణ్య తత్పరుఁడై, దైవజనుఁడై కాలముగడుపుచున్న యీతనికొక పర్వదినమున నొక దివ్యానుభవము గలిగెను. ఆ యనుభవావేశముచే జోసెఫు తనజీవితమును భగవదర్పితము చేయుదు నని పరమ ప్రమాణము గావించుకొనెను. నాఁటినుండియు దన కాదర్శపురుషుఁడగు నొక పూర్వమత సిద్ధుని పేర నాతఁడు 'డామియను' అను నామమును బెట్టుకొనెను. మతవిద్య నమితాసక్తితోఁ నీతఁడు నేర్చుచుండెను. వ్యాపారవిద్య నభ్యసించు కాలమున లాటినుభాష నేర్చియుండక పోవుటచే, మత విద్య కత్యవసరములగు లాటిను గ్రీకు భాషలను గడుశ్రద్ధతోఁ గొలదికాలములోనే నేర్చెను.

డామియను నిరంతరాభిలాష కనుగుణముగ 1863 వ సంవత్సరమున నొక విచిత్ర సంఘటనము జరిగెను. ఆకాలమున నైరోపీయులు దూర సముద్రాంతర ద్వీపముల నన్వేషించుచు నందలి క్రైస్తవేతరులను గ్రీస్తుమతమునకుఁ బరి

వర్తింప మతబోధకులను బంపుచుండిరి. మతాధిపతులు డామియను అన్నను, పసిఫిక్ సముద్రములోని సాండ్విచి ద్వీపములకు మతబోధకునిగాఁ బంప నిశ్చయించిరి. కాని ప్రయాణసమయమున నతఁడు వ్యాధిగ్రస్తుఁడాయెను. అన్న వ్యాధిగ్రస్తుఁడైనందున డామియను అతని పాన్పుకడఁజేర మతబోధకునిగాఁ దన్ను బోనిమ్మని యాతని యనుమతి వడసి, యన్నకు బదులు దాను దైవసేవకుఁ దనజీవితము నర్పింపఁ దలఁచితిననియుఁ దన్ను బోనిమ్మనియు నభ్యర్థించుచు మతాధిపతులకు లేఖ వ్రాసెను. మతాధిపతులా యభ్యర్థనము నంగీకరించి సమ్మతిపత్రము నంపిరి. హృదయ ప్రియమైన పని లభించినందున డామియను ప్రమోద భరితుఁడయ్యెను. సమ్మతిపత్రమును జేతఁబట్టుకొని యానం దోత్సాహమున గంతులు వైచుచు నన్నగదిఁజేరి దన సంసిద్ధతను దెల్పెను. లెక్కలేని యాపదలకు నిలయములగు దూరసముద్రములలో మోటుజాతులవారిమధ్య జీవించుటకు బోవుచున్న డామియనును గుఱించి యాతని తలిదండ్రులు మిగుల విలపించిరి. కుమారుని మరల జూడఁజాలనని తల్లి మేలవై యేడ్వఁదొడఁగెను. "పుట్టిన బిడ్డలెల్లరును నెల్లకాల మును బితరుల నంటిపెట్టుకొని యుండుట దైవచిత్తముకాదు. భగవత్సేవకొఱకు నియతస్థలములకు మానవులేగక తప్పదు. తనబిడ్డలను గాచుకొనుటలో దేవుఁడు ప్రమత్తుఁడైయుండడు" అని చెప్పి తల్లినోదార్చి డామియను పయనమాయెను.

ఆకాలమునాఁటికి సముద్రయానములు విరళముగనే యుండెను. కాని పెక్కండ్రు సాహసికులు జలలోకమున నద్భుత చర్యలకుఁ గడంగుచుండిరి. సమీపమార్గములు వెల్లడికాలేదు. తుపానువల్లను, జలాంతర్గత పర్వతఖండముల వల్లను నోడలకుఁ బెక్కాపదలు దటస్థించుచుండెను. డామియను దన ప్రాణములను దేవుని హస్తములఁ బెట్టి యోడయెక్కెను. ఓడ దక్షిణ అమెరికాకు దక్షిణాగ్రమగు హారన్ అగ్రమునుజుట్టి ప్రాఙ్ముఖముగ మరలవలెను. అచట నొక తీవ్రమైన గాలిలో నోడ దగుల్కొనెను. అది మునిఁగి పోవలసినదే కాని యెట్లో తప్పి, సముద్రమునఁ గొట్టుకొని పోయి నైదుమాసములకు సాండ్విచిద్వీపములను జేరెను. అది ఎనిమిది ద్వీపములగుంపు. వానిలో హవై ద్వీపము పెద్దది. ఎటుఁజూచినను వానికి రెండువేల మైళ్ళలోపున భూఖండములు లేవు. ఆద్వీపములలో నగ్ని పర్వతములుండెను. అవి కొంతకాల మగ్నులను గ్రక్కి శాంతిఁబొందెను. నేల సారవంతమైనదే. సముద్రపుటంచు వఱకును బెరిగిన నారికేళ వనములును వివిధ కుసుమ ఫలవనములును ద్వీపముల ప్రకృతి రామణీయకతను బెంపొందించు చుండెను. ఇచ్చటి ప్రకృతి సౌందర్యమును జూచి డామియను ముదిత స్వాంతుఁడై, సృష్టికర్త కళాకౌశలమును స్తుతించెను.

ఈ సాండ్విచిద్వీపములను మొదట 1778 వ సంవత్సరమున 'కెప్టెనుకుక్కు' అను నౌకాయాత్రికుఁడు దర్శించి ప్రపంచమున కెఱుకపఱచెను. ఈదీవులందొకజాతి స్వదేశీయులు

గలరు. వారు దమ బంధుమిత్రులతోఁగూడి గుంపులుగ నివసించుచుండిరి. వారి పరస్పరప్రేమ వర్ణింపరానిది. ఎన్ని వ్యాధులు వచ్చినను వా రొకరి నొకరు బాయక సంఘజీవనమున సుఖదుఃఖము లనుభవించుచుండిరి. వారిలోఁ గొందఱు క్రైస్తవులైరి. చిరకాలము నుండియు మద్యపానవ్యసన మచ్చటివారిలో బలముగనుండెను. ఎట్లో కుష్ఠవ్యాధి చొరఁబడి నానాఁటికి మితిమీఱుచుండెను. దేశీయులసంఘాచారములను బట్టి కుష్ఠరోగులను వేఱుపఱుపవీలులేదు. అందఱును గుమిగూడితినుచు నిద్రించుచు నుండుటచే వ్యాధి ప్రబలమగుచుండెను. చివరకా దేశపుఁ బ్రభుత్వము కలుఁగజేసికొని కుష్ఠరోగుల నొక ప్రత్యేక స్థలమునకుఁ బంపివేయ శాసింపవలసి వచ్చెను. ఇట్టి సమయములో డామియను మానవసేవ కొఱకును మత ప్రచారమునకును నటకుఁ జేరెను.

డామియను హావై ద్వీపములలోని యోడరేవగు హొనొలులులో నోడదిగెను. అప్పటి కాతఁడిరువదినాలుగేండ్లవాఁడు. దైవభక్తియు, మానవసేవానిరతియుఁ గార్యోత్సాహమును నాతని మనస్సునఁ బొంగి పొర్లుచుండుటచే నెట్టి కష్టములును నాతని దృష్టికిఁ గాన్పించుచుండుటలేదు. ద్వీపములకుఁ దాను గ్రొత్తవాఁడు. అచ్చటి జనులు తనకు విజాతీయులు. చక్కని బాటలుగాని రైలుమార్గములుగాని లేవు. అగ్నిపర్వతములు వెలిక్రక్కిన లావామట్టిమీఁద నడచిపోవలెను. ఎటుఁజూచినను గుష్ఠవ్యాధిలక్షణము లెచ్చుగఁ గోచరించుచుండెను. మానవుని జీవితమును నరకప్రాయముగఁజేయు వ్యాధులలో

కుష్ఠము మొదటిది. అగ్నిలోదుమికిగాని, విషముద్రావిగాని ప్రాణము నర్పించుట కంగీకరింపవచ్చునేమోగాని బుద్ధిపూర్వకముగఁ గుష్ఠవ్యాధిని గొనితెచ్చుకొనుట కేమానవుఁడును సాహసింపఁడు. పరస్పరసంపర్కము వలన నీవ్యాధి వ్యాపించుననుభయముచే గుష్ఠరోగి నెవ్వరును దరిఁ జేరనీయరు. ఆలుబిడ్డలైన నసహ్యించుకొందురు. ఔషధచికిత్సలకు సామాన్యముగ లొంగువ్యాధి కాదు. రోగి యవయవములను దినివైచి కురూపునిగావించి పీడించి పీడించి చంపువ్యాధిగాన నిట్టి తావుల మానవసేవయచింత్యము. కాని డామియను తన హృదయమున దివ్యజ్యోతిని వెలిగించుకొని జంకక కొంకక కార్యరంగమునకు దిగెను.

ఆద్వీపములలోఁ గ్రైస్తవమతాధిపతియొకఁడుండెను. ఆయనయాజ్ఞల ననుసరించి డామియను పనిచేయవలసియుండెను. డామియను తన కేర్పఱుపఁబడిన మండలమునఁ బ్రజల కష్టసుఖముల నరసి మతబోధగావించుచుఁ ద్వరలోఁ బ్రజలకు సుపరిచితుఁడాయెను. కొండలదేశమగుటచే నాతఁడు వరకములగు కొండలెక్కియుఁ, బాదచారియై సంచరించియు ననువైన చోట్ల నశ్వారోహకుఁడై యేగియుఁ గాయకష్టములకు సహించి సేవాధర్మమును సార్థకపఱచుచుండెను. కఱకు గుట్టలనెక్కుటలోఁ గాలుసేతులు గొట్టుకొనిపోయి, రక్తము చిమ్ముచున్నను దేహము బడలికచేఁ దూలుచున్నను దనపూనిమానక భక్తులను దర్శింపఁబోయెడువాఁడు. సురూపుఁడును దృఢగాత్రుఁడును నుత్సాహవంతుఁడును నగు దమ నూతన

బోధకునిజూచి ప్రజలానందించిరి. డామియను తన ప్రజలతో నుత్సాహము పురికొల్పి, తాను స్వయముగ దూలములను స్తంభములను రాళ్ళను మోచి దైవప్రార్థన కొఱకొక యాలయమును నిర్మించెను. బలిష్ఠమగు సుందర దేహముతో, చెమటలు గార్చుచు నాతఁడు దూలములు మోయుచుండ నాతని ప్రజలు ఖిన్నులగుచుండిరి.

కుష్ఠరోగులను ప్రత్యేకస్థలమునకుఁ బ్రవాసము బంపు శాసనమును కఠినముగ నాచరణలోఁ బెట్టుటకు హవై ప్రభుత్వమువారు సంకల్పించిరి. మొలోకై యను నొకచిన్న ద్వీపమునకు వారిని బంపివేయున ట్లేర్పరచిరి. రోగులను హొనోలులు రేవులో నోడ నెక్కించుచుండిరి. కుటుంబములలో నుండి రోగులను బలవంతముగఁ గొనిపోవుచుండిరి. కొందఱు రోగులను వారి బంధువులు రహస్యస్థలములందును, అడవులలోను దాఁచుచుండిరి. భర్తలకొఱకేడ్చు భార్యల యొక్కయు బుత్రులకొఱ కేడ్చు తల్లిదండ్రులయొక్కయు నార్తాలాపములతో నాకాశము చిల్లులు పడునట్లుండెను. డామియ నీ రోదనదృశ్యములను దృఢచిత్తముతో గనుంగొనుచు నెల్లర నోదార్చుచుండెను. దుష్టవ్యాధి బాధితులనైనను బంధువులనుండి విడఁగొట్టుట హృదయవిదారకము గదా!

మొలోకైద్వీపమునకుఁ బంపివేయఁబడిన కుష్ఠరోగుల కొఱకొక మతబోధకుని బంపవలెనని మతాధిపతి యాలో

చించెను. ఇతర బోధకు లెవ్వరును బోవ సమ్మతింపని యీచోటికి డామియను దానుపోవుటకు సంసిద్ధుఁడనని నివేదించు కొనెను. అతఁడిప్పటికి ముప్పదిమూఁడేండ్ల యీడువాఁడు. మిసమిసలాడు యౌవనము, కండలు దేలిన దృఢగాత్రము, ఉత్సాహదీప్తులను వెదజల్లు నేత్రకాంతులు, బిగువును వెనుబాటును లేని యాతని కడంకను గనుంగొని మతాధిపతి యాతని బోనిచ్చుటకు సమ్మతించెను. ఏబది మంది కుష్ఠరోగులను వెంటబెట్టుకొని డామియను మొలోకై ద్వీపము చేరుకొనెను. రోగుల యవస్థలు చూచి యాతని హృదయము దహించుకొని పోవుచుండెను. వారినందఱ నొక చోటఁజేర్చి యాతఁడు "బిడ్డలారా! బంధువుల నుండి విడిపోయితిరని విచారింపకుఁడు. అందఱకును బంధువగు దేవుఁడే మీకును ప్రథమ బంధువు. మీవ్యాధిని గుండె నిబ్బరముతో సహింపుడు" అని ధైర్యవచనములు పల్కెను.

రోగులుచిన్నచిన్న కుటీరములలో నివసించుచుండిరి. అవి యసహ్యముగనుండి శిథిలరూపములోనుండెను. రోగుల వస్త్రములును దేహములును వారి దురభ్యాసములవలనను, ఘోరవ్యాధివలనను దుర్గంధపూరితములై యుండెను. ఆ కంపును వారించుకొను నిమిత్తము డామియనుపొగచుట్ట నభ్యాసము చేసికొని రోగులమధ్యఁ దిరుగుచుండెను. తనకుసరియైన యిల్లులేక చెట్లక్రిందఁ గాలముగడుపుచున్నను రోగులకొఱకు గృహనిర్మాణమున కాతఁడు ప్రప్రథమముగఁ బూనుకొనెను. రోగులయిక్కట్టల నాతఁడు హవై ప్రభుత్వమునకు విన్న

ఖింపఁగా వారు వస్త్రములను, ధనమును, గృహనిర్మాణ పరికరములను బంపిరి. ఆసహాయమును గ్రహించి బలాఢ్యులగు కుష్ఠరోగులను దోడుగ నిడుకొని డామియను గృహములను, దేవాలయములను, వైద్యాలయములను నిర్మించి రోగులకుఁ జక్కని సౌకర్యము లొనఁగూర్చెను. అంత వఱకును రోగులకుఁ దగిన నీటివసతిలేదు. చాలదూరమునుండి బిందెలతో నీరు మోసి తెచ్చుకొనువారు. డామియను ప్రభుత్వమున కీ విషయము తెల్పి, నీటి గొట్టములను దెప్పించి, దూరమున నున్న జలాశయమునుండి నీరు రోగుల యిండ్లదగ్గఱకు వచ్చునట్లేర్పఱచెను. కుష్ఠరోగుల మద్యపానదురభ్యాసమును మాన్పించుట కీతఁడు తీవ్ర కృషి సలుపవలసివచ్చెను. ప్రతిమాలియు, నిర్బంధించియు, బెదరించియుఁ బలుపాట్లుపడెను. ఈయత్నమున గొందఱకీతనిపై ద్వేషము జనించెను. కాని తుదకు వారు దమపానపాత్రలను బ్రద్దలుగొట్టివైచి డామియనునకు దాసులైరి.

రోగుల కెట్టిసేవ చేయుటకైనను డామియను వెనుదీయువాఁడుగాఁడు. దుర్భర కుష్ఠవ్యాధి తనకు సంక్రమించునేమోయని యతఁడించుకంతయు సంకోచింపలేదు. రోగుల వికృతరూపములను జూచియైన నేవగించుకొనలేదు. ఒక్కొక్కప్పుడు చనిపోయిన రోగులను బూడ్చిపెట్టుటకుఁ దానే గోతులు ద్రవ్వెడువాఁడు. ఇట్లు పదియేండ్లు సేవాదీక్షయందు గడచెను. క్రమముగ డామియను శరీరమున వ్యాధిబీజము లంకురించెను. ఈతని సుందరవదనమున మచ్చలేర్పడఁదొడఁ

గెను. అవయవములయందు బాధ పొడముచున్నను నాతఁడు సరకుగొనక తనపనిని క్రమముగనిర్వర్తించుచుండెను. వ్యాధి వలనఁ జేతులుపోయినవారికిఁ దానే యన్నము దినిపించెడి వాఁడు. ఇట్టి యకారణబంధు వెందుఁగలుగును ! స్వజను లకు వ్రాసిన లేఖలలోఁ దన వ్యాధిని గుఱించి తెల్పు కొనలేదు.

డామియనునకు వ్యాధి నానాఁటికి ముదురుచుండెను. మృత్యువాసన్నమగుచున్నదని యాతని మనస్సునకు దృఢ మాయెను. ఒక మిత్రునికి లేఖవ్రాయుచు నాతఁ డిట్లు దెల్పెను. "నా కర్తవ్యమును నేను నెరవేర్చితిని. కుష్ఠ వ్యాధిని బుద్ధిపూర్వకముగ స్వీకరించితిని. త్వరలో దేవుని సమక్షమున నుందును." డామియను వ్యాధివార్త వివిధదేశ ములవారికిఁ దెలిసెను. 'ఎందఱనో రక్షించినవాఁడు దన్ను రక్షించుకొనఁజాలక పోయినాఁడు' అని వారు విలపించిరి. పుత్త్రుని దుర్వ్యాధివార్త తల్లికిఁదెలిసి దిగులుచే నామె త్వరలోఁ దన దేహయాత్రను ముగించెను. ఆమె మరణానం తరము డామియను తన యన్నకొక యుత్తరములో నిట్లు వ్రాసెను. "అన్నా ! దేశాంతరముపోయిన సోదరుఁడు మర ణించెనని వార్తాపత్రికలు దెల్పెనేమో ! అందుచేతనే నీవు లేఖలు వ్రాయమానితివి గాఁబోలును. భగవంతుఁ డింకను నీ దేహవిమోచనము నా కనుగ్రహింపలేదు. బుద్ధిపూర్వక ముగ నంగీకరించిన వ్యాధితోఁ బరమాత్మ సన్నిధికేగఁగలను గాన నా కించుకయు దిగులులేదు."

డామియను వ్యాధి ముదిరెను. మరణ మత్యాసన్న ముగ నున్నదని యాతనికిఁ దోఁచెను. తన ప్రాపంచిక వ్యవహారముల నన్నిఁటిని దన యనుచరులకు విశదీకరించి డామియను తన నలుబది తొమ్మిదవ యేటఁ బ్రశాంతచిత్తముతో దేహమును జాలించెను. బాల్యమునుండియు సౌందర్యోపాసకుఁడును బరార్థబుద్ధియునై స్వేచ్ఛికముగఁ గష్టములను వరించి, యెఱిఁగియెఱిఁగి భీకరవ్యాధిని దెచ్చిపెట్టుకొని స్థిర సంకల్పమున బ్రాణములర్పించిన డామియను త్యాగవీరుఁడు గదా !

సమాప్తము